లోని రాజకీయకళాశాలలయందు ముప్పదియేండ్లకాల మాంధ్రపండితులై వెలసిరి. ఆంధ్ర విద్యాపారంగతు లని పేరెన్నికగన్నవారు. ఆంధ్రులలో మహామహోపాధ్యాయబిరుద మందినవారిలో వీరే ప్రథములు వీరు ఆంధ్రభాషాసంజీవని యను పత్రికను నడపి ప్రసిద్ధిగాంచిరి.

పందొమ్మిదవశతాబ్ది ఉత్తరార్ధమున ఆంధ్రవాఙ్మయము ఆంగ్లవిద్యాసంపర్కముచే క్రొత్తపోకడలఁ బోవసాగెను. నాటకసారస్వతము నూత్నముగ నాంధ్రమున పుట్టి పెరుగఁజొచ్చెను. సంస్కృతనాటకము లెన్నియో ఈ భాషలోనికి తర్జుమాచేయఁబడెను. ఆతరుణమున వెలసినవిజ్ఞులలో నొక్కొక్క రొక్కొక్కపత్రికతో సంబంధము సమకూర్చుకొని అన్యోన్యగ్రంథములపై విమర్శప్రతివిమర్శలు చేయుచు మోమోటమిలేక వాగ్రంగమున సంకులసమరము సలుపుచుండిరి. పండితు లనేకు లనుమోదకులై పత్రికాప్రచురణములకు ప్రోద్బల మొసఁగుచుండిరి. కొన్నివిషయములం దావిమర్శనములు వ్యక్తిదూషణములపాలయి పాఠకులకు విసువెత్తించినవి. భాషాజిజ్ఞాసువుల కవి యే కొంచెమో యుపయోగపడినను పరస్పరవివాదములచే నలుసులెన్నినట్లును స్తనశల్యపరీక్ష చేసినట్లును నెరసులు వెదకుటవల్ల నాపత్రిక లాసంపాదకులకాలమందే చివర కల్పాయుష్కములైనవి.

శ్రీపంతులుగారు సంస్కృతాంధ్రములం దసమానపండితులు. మహామహోపాధ్యాయ బిరుదము వారి భాషావైదుష్యమును చాటును. తొలుదొల్త నీబిరుదమునందుటయే పండితలోకమున కీయనపై మత్సరమునకు హేతు వని కొందఱిమతము. వీరి బిల్వేశ్వరీయముపై "అముద్రితగ్రంథచింతామణి"యందు ప్రకటితమైన విమర్శనమే యట్టి మత్సరమునకు మూల మని మఱికొందఱి యభిప్రాయము. ఆయన యింటఁగాని, బయటఁగాని యెల్లవారితోను సర్వకాలసర్వావస్థలందును వ్యాకృతభాషనే భాషింప సమకట్టినవాఁడు. ఆపట్టుదలకై ఆయనమిత్రు లాయనను "ఆంధ్రజాన్సన్" అని పిలుచుచుండిరఁట! ఇది యెట్లున్నను, ప్రిన్సఫ్ వేల్సు హిందూస్థానసందర్శనసందర్భము వర్ణించుచు, దేశభాషాకవులు అన్నిభాషలలో పద్యములు వ్రాసి ఆంగ్లానువాదములతోఁ బంపఁగా, ఆరచనలలోని ప్రౌఢికి లండన్ క్రౌన్ పెర్ఫ్యూమరీకంపెనీవారు శ్రీపంతులువారినే సన్మానించిరి.

ఉ. ప్రిన్సఫువేల్సు నాఁ బరఁగు శ్వేతముఖాధిపు రాక సాకుచే
తన్నముదంచితంబుగను తారకహారము పంచి వేల్లదీ
విన్నభవల్ల నీ వెనసి విశ్రుతసత్కృతి నాంధ్రభాషకున్
మున్నమకూర్చితౌర గుణముం గవిరత్నమ! ధీరరత్నమా!

—బిల్వేశ్వరీయము.

ఆహా! మనభాషకే యి దెంతగౌరవము!!

శ్రీపంతులుగారు నీతిచంద్రిక, ప్రిన్సు ఆఫ్ వేల్సు హిందూస్థానసందర్శనము, శంకర
విజయధ్వజము, సింహాచలయాత్ర, బిల్వేశ్వరీయము, ధనంజయవిజయవ్యాయోగము, నర
కాసురవిజయవ్యాయోగము ఇత్యాదు లనేకగ్రంథములకు కర్తలు. వీనిలో నీతిచంద్రిక
చిన్నయసూరిగారి నీతిచంద్రికకు శేషగ్రంథముగ రచితమైన వచనకావ్యము. ఇదియు
బిల్వేశ్వరాదులును ఒకప్పుడు యూనివర్సిటీపరీక్షలకు పాఠ్యగ్రంథములుగ వెలసినవి
వీరిశైలి కడుపెడుసు. ఆ పెడుసుఁదనము ప్రకృతనాటకమున సైతము ప్రత్యక్షము.

పరస్పరవైషమ్యముచేతనైననేమి భాషోద్ధరణాశయముచేతనైననేమి అన్యోన్య
రచనలను పండితులు తీవ్రవిమర్శనములకు గుఱిచేయుచుండిరి. బ్రహ్మశ్రీ వేదమ
వేంకటరాయశాస్త్రులవారు శ్రీకొక్కొండవారి గ్రంథమును తీవ్రఖండనములచే విమర్శి
చిరి. శ్రీకొక్కొండవారు శ్రీశాస్త్రులవారి ప్రతాపరుద్రీయమును చీల్చిచెండాడ సెం
నాటకములలో గ్రామ్యభాషాప్రయోగమును నిరసించిరి. నెల్లూరిలోని "వాగ్వల్లి" అ
పత్రికయొకటియే శ్రీవేదము వేంకటరాయశాస్త్రులవారి శాకుంతలము తొలిపద్యములల
శతాధికదోషములు చూపినది. ఇరుపక్షములవారిని గావలసినవారు శ్లాఘించుచుండి
ఉద్దండపండితు లీలాగున చెలరేఁగి వ్రాసినవ్రాఁతలు మన కీనాఁటి కొక్కింత యేవపుట్టిం
నను నాఁటి కవి యుక్తము లనియే ఆదరణ మందినవి.

నాఁటివిమర్శన లెల్ల పదప్రయోగాద్యౌచిత్యమునుమాత్రమే విశేషముగ నా
యించియుండెను. ఇట్టి విమర్శనములను ఖండించుచు శ్రీగిడుగు రామమూర్తిపంతులవా
తమ "తెనుఁగుపత్రిక"యందు "భాషాభిషక్కుల భేషజ" మనుపేర కవిప్రయోగవ
నెల్ల నారయక యేలక్షణగ్రంథమునో ఆధారముగ నిడుకొని గ్రంథములతీవ్రవిమ
లకు గుఱిచేయించు టుచితముకా దనియు, సమకాలికపండితులు పత్రికలలో దూ
ఘూంఘ్నము లగు వ్రాఁతలకు వశు లగుట సారస్వతాభివృద్ధికి బాధక మనియు పలువిధవ
సూచించియున్నారు. వారియాక్షేపణములకు సమాధానముగాని వారిమత మసం
మన్న యధిక్షేపముగాని నేఁటివఱకును వెలువడ లేదు. కనుక నే శ్రీకొక్కొండవారు
భాషాసేవకై వారిని సంస్మరించుచు, ప్రసన్నరాఘవవిమర్శ భాషాభేషజములలో ప్ర
కితమైన గుణదోషముల నిష్పక్షపాతముగ పరామర్శింపఁగోరువారికి మూలగ్రంథ మ
వశ్యకముగావునను, బ్రహ్మశ్రీ వావిళ్ల రామస్వామిశాస్త్రులవారికిని శ్రీపంతులవారికిని
సిన చిరకాలమైత్రిని పురస్కరించుకొనియు, నీగ్రంథమునకు పునర్ముద్రణ మత్యంతావ
కమైనది. ఆలోచము దీర్ప సంకల్పించిన భాషోద్ధారక శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రుల
ఆంధ్రలోకమున కెంతయు నాదరణీయులు. వారి భాషాసేవ చిరస్మరణీయమై
ఈ తొలివ్రాఁత వ్రాయ నవకాశము నాకొసఁగినందులకై వారికి నేనెంతయు కృతజ్ఞు

చెన్నపట్టణము.
3 మే, 1945.

వేదము లక్ష్మీనారాయణశా



శ్రీప్రసన్నరాఘవాయ నమః.

# ఆంధ్రప్రసన్నరాఘవనాటకము

## పీఠిక

---

శ్లో. శ్రీతనుమధ్యా మంబాం జగతాం శ్రీబిల్వనాథ మపి పితరమ్
తచ్ఛివమిథునం శివదం శివాయ చేతోంబుజే భజేఽహమిహ.

క. తనుమధ్యం బిల్వేశ్వరు, నిని జగములకెల్ల జననినిం జనకునిఁ ద
ద్వినుతశివమిథునమును శివ, మునకై సేవింతుఁ జిత్తమున శివదంబున్.

చ. భువి జయదేవనామకకవిపుంగవనిర్మిత మైన ప్రసన్నరా
ఘవ మనునాటకం బెసఁగుఁగా యది ప్రాకృతసంస్కృతాత్మకం
బవు నిది తత్సమాంధ్రకృతి యంచితమాంధ్రప్రసన్నరాఘవం
బవు ననఁ జేయ నెంచితి సహాయుఁడు దేవుఁడె నేను రత్నమన్.

క. పద్యమునకుఁ బద్యంబును, గద్యమునకు గద్యమును దగం బొడకట్టన్
హృద్యంబుగ నీకృతియం, దాద్యకృతిం గాంచినట్టు లర్హులు పొగడన్.

ఉ. కాఁ గనుకన్ దదర్థ మిట నారయుఁడీ రసికు ల్సమంబుగా
బాగుగ నున్నచోటులకు బన్నుగ మూలకృతిన్ గన్నుఁడీ
బాగుగ లేనిచో నను దవం దెగడుండు ప్రసన్నరాఘవం
బేగద నాటకం బిది మహిన్ మహనీయమె యౌతఁ దద్దయున్.

తే. అరసి సిద్ధాంతి శివశంకరాఖ్యశాస్త్రి, కరుణ నాంధ్రప్రసన్నరాఘవము దీని
సంకిత మొనర్పు నీతండ్రి కనియె మైత్రి, "నాత్మవత్సర్వభూతాని" యనువడువున.

చ. అవుటఁ బ్రసన్నరాఘవసమాహ్వయనాటక మిద్ది రాఘవుం
డవుటను దాతభక్తిభరుఁ డాక్రమముం గ్రహియించి యీకృతిన్
బ్రవణత నాదుతండ్రికి నిరంతరకీర్తి భువిం బ్రవర్తిలన్
దివి బహుసౌఖ్యము ల్వెలయఁ దృప్తిగ సంకితమే నొనర్చెదన్.

"సీ. నరసుతుఁ డనఁ నేల సురసుతుఁడును నగు ధర్మకనిరతత దానపరత
రమ్యుండు విద్యచే సౌమ్యత మితహితసత్యభాషణముల శాంతవృత్తి
సింహాసంహాసనమందు స్థిరత శౌర్యముచేత నంతరరుల గెల్చె నరు లెవ రికఁ
గణనీయుఁ డతఁడె లోకత్రయజయమునఁ గామరోషాళలఁ గననికతన

గీ. రాజపూజ్యుండు స్వాశ్రితరక్షకుండు, యమనియమముఖయోగాంగుఁ డాత్మబోధుఁ
డుచితవేషుండు భూసురుం డుత్తరుండు, శ్రీముఖాభిఖ్యుఁ డితఁడె నాఁ జెలఁగునతఁడు."

(బిల్వేశ్వరీయము.)

## షష్ఠ్యంతములు

ఓంకారవాచ్యభక్తున, కంకరహితసచ్చరితున కాత్మజ్ఞునకున్
శంకాతంకాజ్ఞునకున్, శంకరనారాయణైక్యసజ్జ్ఞానునకున్. ౧

నరసింహకులామరునకు, నరసింహ నువినుతునకుఁ బ్రణయవినయునకున్
నరసింగరాయశర్మకు, నరసారధిదేవరూపనామరతునకున్. ౨

మహితాదివేదునకుఁ బ్రాపహవిశ్వామిత్రగోత్రభవభాగ్యునకున్
మహిఁ గొణ్డగృహాఖ్యున, కహితపద్దైకాజ్ఞునకు మహాభిజ్ఞునకున్. 3

శిథిలేతరనిజమతునికి, బుధవినుతాచారునికిని బుణ్యాత్మునికిన్
సుధరవరసుధీరునికిన్, మధురహితమితాప్తభాషణప్రౌఢునికిన్. ౪

వాదప్రతివాదాభా, వాదరునికి దీనబాంధవావనునికి స
త్త్వోదారునికి సుదారుని, కాదృతవినయునికి ధార్మికాగ్రసరునికిన్. ౫

యతిభక్తునికిం గోవిం, దతనయవాగోద్భవునికి నరసాంబాన
త్సుతునికి రామాంబాపతి, కతులమతికి నాజనకుని కధికసుకృతికిన్. ౬

# ప్రథమాంకము

శా. చేయుంగ్ శ్రేయము నవ్వి విద్రుమలతాశ్రీకాంగుళిశ్రేణికల్
జ్యాయశ్శోణసరోజకోరకరుచుల్ షడ్గాత్మునశ్శైతులుక్
ప్రాయు న్నల్వమొగంబులందు నెవి యోష్ఠల్ వ్రాల్దమ్మివాల్గంటిచ
ద్వ్రోయిం జిక్కిళులందుఁ బత్త్రముల సెంతో వేడ్క నువ్వొత్తుగన్.

వ. మఱియును.

శా. ఆరూఢి న్సుఖదం బవు న్హరిముఖాబ్జాంచన్మరుస్మాధురీ
ధీరోదాత్తమనోహరం బడె సదాప్తిం బాంచజన్యస్వనం
బారాల్లంఘితమేఘనాదవిభవం బై కుంభకర్ణవ్యథన్
గూరించుం దితిజేభరాజికెది ప్రీల్గొల్పం దశాస్యాళలన్.

వ. అదియునుంగాక.

ఉ. పొక్కిలితమ్మినల్వ గడుఁ బొల్పుసఁగం బొగడంగఁ గన్నులం
జక్కఁగ విప్పెలర్పఁగను జందురుమో మలరంగఁ గిన్కమై
గ్రక్కున నుక్కుమీఱి మధుకైటభుల న్సరసంబుగా సిరిన్
మక్కువ వాకపతిం గనెడుమాధవుఁ డేలెడు మమ్ము నిమ్ములన్.

[నాంద్యంతమందు]

సూత్రధారుఁడు: [ముందు చూచి సహర్షంబుగ,] ఔరా! ఏప్రకారముగా నీపారిషదులు నిజాస్యశారదారవిందలాస్యలాలసార్యాలోచనఖంజనుండును, నిఖిల మునిజనమనోరంజనుండును, కపర్దరంగనర్తితగంగాతరంగనికరుండును మందాకినీహారిచందనలాలాటికాయమానమకుటఘటితనవసుధాకరుండును, అక్కటికమున కిక్కయును, ముజ్జగమ్ములనుతమ్ములఁ గలిగింపఁగల తెలిదామరదుంపమొలకయును, షాడ్గుణ్యసంపన్నుండు నైన శంకరునియాత్రయందు గుమిగూడియున్నవారు! కనుక, వీరి ప్రోలఁ జేరి, స్వకలాపలోకనానుగ్రహమునకై వేఁడుకొనియెద. [అంతయుం విమర్శించి] అవుఁబో, వేఁడుకోలున నేమి? ఎందువల్ల ననఁగా;

క. నేర్పరులు రూపుచేతనె, యేర్పఱుపంగలరు పరులయింగిత మూహన్
వేర్పడని మొగలిపూవు ద,లిర్ప న్వలపునను నళులలీలం బోలన్.

[విలోకించి సహర్షంబుగ] తగు నీయనుసంధానమువలననే, సామాజికసమాజముచే బోధింపఁబడినవాఁడు వీఁడె నాయొక్కచెలికాఁడు రంగతరంగుఁ డిక్కడకే వచ్చుచున్నాఁడు.

నటుఁడు—[ప్రవేశించి] ఓయిభావా ! సభవారు నాచే నీకుఁ జెప్పించుచున్నారు. ఎట్లనఁగా, భరతరాజ [అని సగముమాట చెప్పఁబడఁగా].

సూత్రధారుఁడు—[చెవులుమూసికొని] హా ! అయుక్తమయుక్తము. అవుఁగాక. నిశ్శేషమగు నందాక విందు.

న—భావా ! ఇప్పు డిది యే మయుక్త మని నీవు చెప్పితివి ?

సూ—ఓయీ ! ఇద్దియేకద, పెద్దవాఁ డుండఁ జిన్నవాఁడ నైన నాయెడ రాజపదము చెప్పఁబడియె. నేనన్నన్ భరతమాత్రుఁడనే. మఱి నాయన్న గుణారాముఁడు రాజపదభాజనుండు.

న—ఎట్టిగుణములఁ గలయట్టివాఁడు నీగుణారాముఁడు ?

సూ—ఓయి ! పేరనే యుత్తరము దత్తము.

న—[నవ్వి] గుణములపొందిక పేరనే యెట్లు ?

సూ—అట్లే

తే. గుణగణములను రూపించుఁ గుఱుత మొదలు, గొప్పవారికిఁ బేరె యీక్షోణియందు
మొగి సువర్ణంబు శ్రీఖండమును మఱియును, జలధి రత్నాకరసుధాకరు లెటు లటుల.

మఱి యిది యేమి ! గుణారామునందుఁ బేరుచేతనే గుణాధిగమ మెట్లని యుపహసింపఁబడియె? ఎవఁడు జనకుఁడను పేరుగల యేలికయోలగంబున హరచాపారోపణంబను రూపకను నభినయించి, కడుఁ దనిసిన యామొదయునిచే నీయఁబడిన రంగవిద్యాధరుఁ డను ఖ్యాతిం గాంచంబోలెఁ బడసె, వాఁడుగదా !

న—అతఁ డిపు డేదా డలరించుచున్నాఁడు?

సూ—దక్షిణాపథమును. దాక్షిణాత్యుం డగు నొకానొక నటాపశదుఁ డీగుణారామనామము తనదియే యని చెప్పుటచేత నీతనియొక్క రంగవిద్యాధరుఁడను ఖ్యాతి వానిచే నపహృతమయ్యె. అయ్యది విని గుణారాముఁ డాదెస కరిగె. మే మిపుడు వింటిమి, సుకంఠుఁ డను పేరుగల గాయకునితోఁ జెలిమిచేసి దాక్షిణాత్యుం డగు వాహినీపతియొక్క యోలగంబున రంగసంగర ముపక్రమించినాఁ డని.

న—ఆహా ! మహోపక్రమము.

సూ—ఇం దచ్చెరువు పుట్టదుగద ! ఎట్టు లన్న.

ఆ. బిసమనోజ్ఞభుజ సువికసితాంబుజనేత్ర, శరదుదీర్ణపూర్ణచంద్రవదన
చంద్రికాస్మిత యవు సత్కీర్తి నవహృత, దయితఁ బోలె నెనయఁ దడవఁ డేవఁడు.
కనుక, సామాజికులయొక్క సందేశరహస్యము నంతయుం జెప్పుము.

న——ఎది యన నిదియె గద, నీచే నభినయింపఁబడుదానిం గాంచెదము.

సీ. ప్రతియంకమునగు * సర్వరసాంకురంబు * న్నకసుమమావళి * రాజితంబుమఱియుం
* ఘనైతరాంశునిక్తై * వడివక్రతి షైన - సాత్త్వికవ మైత్రక * టును
సందర్భమై లో * కనన్నుతంబై నాట్య * ముఖ్యప్రబంధమ న్ప్రఖ్యానుగని
వేదరాశికి నెట్లు వేదాంతశాస్త్రమ ట్లవ్వను సాహిత్యవిద్యకునెది దువ
నమరు నమరాద్రివలె సువర్ణాప్తిరుచిర *, పదకలన నప్పరోంగనభంగియల్ను *
ప్రకటనీయార్థమున నిధివగిదిఁ గవిక్ర *, తంబు శ్రుతిరంజనంబు గేయంబు సుకృతి *

సూ——[విమర్శించి, సహర్షంబుగ] మారిషా! ఏ మని పేరుపొందిన దీనాట్యప్రబంధ మని యొఱుంగుచున్నావా? [వెండియుం విమర్శించి, విహసించి] ఓయీ యేనాదల నత్తమిల్లి యున్న నల్లగల్వరేకను గడలికడలుల గమికడ నెమకునట్లు దీనినామధేయమును వేఱుగా నిరూపించుచున్నాను. ఓయీ! ఇదే యీపద్యమునం దావియుండి యేడేసియక్కరములంగల పదిబంతుల నొగివ్రాసినఁ "ప్రసన్నరాఘవనాటకము" అని, మఱి యొత్తుగీతి నాల్గడుగుల యంత్యాక్షరంబులం గ్రమంబుగాం జదివిన "రత్నకృతి" యని సువ్యక్త మవును.

న——[పద్యముం జదివి విమర్శించి సహర్షవిస్మయంబుగ] అహా! ప్రసన్నరాఘవనాటకమనునది యీదృశ్యప్రబంధమునకుఁ బేరగుఁగాని, రత్నకృతి యన నేమి?

సూ——క తనుమధ్యాబిల్వేశుల, తనయుం డగు బ్రథితుఁ డయ్యెఁ దచ్ఛిష్యుఁడు స
ద్వినుతుఁడు కొక్కొండాన్వయుఁడగు వేంకటరత్నశర్మ యతనికృతి యిదొ.

న——ప్రసన్నరాఘవనాటకగ్రంథమునకుఁ గొక్కొండ వేంకటరత్నశర్మ కర్తయా?

సూ——ఈయాంధ్రప్రసన్నరాఘవనాటకప్రబంధమునకు.

న——ఈభాషాంతరీకరణమునకు ముం దీనాటక మేభాషయం దుండెను?

సూ——దేవభాషయందు.

న——అహాహా! కవు లనెడు కలువలవికసనమునకు వెన్నెలయైయున్న చదువులయన్నయొక్క మక్కువ పెంపుసొంపు. దాని యనుభావమువలననే కవుల కిటువంటి వింత తీపుఁబలుకులు వెలయుచున్నవి.

సూ——కట్టిని యీ కవిచేతనే చెప్పఁబడియెను.

చ. చదువువెలంది త్వచ్చరణపారసరేణుకణంబు చిత్తభూ
మిఁ దవరు సజ్జనాళి కెది మించు నదే కవితాలతాకృతిన్
బొదలెడు నీచెవిం జివురు పొందిక సూక్తిచలచ్ఛిరస్స్రగ
గ్గదితసుపారిజాతకలికాస్తబకంబునఁ బాద మూనెడిన్.

[విమర్శించి] పలుకు మించుబోణి యను రాయంచ యెవ్వనియొక్క మొగమ ద
నిమ్ముగ నెనసి, నలువమోము తామరతోఁట చెలియాట యుబుసుపోక నెనయుం
ఆ కవిబ్రహ్మ యగు వాల్మీకిమునియందు నా చిత్తము మఱియుఁ గౌతుకాయత్త
చున్నది.

న—ముజ్జగంబులందు నిది యిట్టిదే కదా.

ఉ. శ్రీరఘురామకీర్తినటి చెన్నుగ నాఁడెఁగఁ దోడ ప్రోయం వా
ద్యారవమాద్యముం గలుగు నట్టిఁ డెనం గెడుఁ బుట్టుపుట్టువౌ
వారక యేని మోము నెలవల్లను గల్గిన కావ్యసత్సుధా
వారిధిఁ ద్రావి సత్కవి నవస్తనయిత్నుతతుల్ ప్రసంబిడున్.

[విమర్శించి] ఎవని కీర్తి యనెడు పున్నమవెన్నెలచే ముద్దిడఁబడినదై వాల్మీకియొ
యుం జదువుసంద్రముల్లసిల్లెనో, ఆరామచంద్రుఁడే నాయెద యను వె
పులుఁగును నలరించుచున్నాఁడు.

సూ—ఇది యుక్తము.

తే. చంద్రునందును శ్రీరామచంద్రునందు, నల్లగల్వల నెయ్యంపుఁ బెల్లుఁ జిగిని
సొబగుమీఱు మిటారులచూపునందు, నెవనికి న్మది ముదమొంద దెనక మెసఁగ.

మఱియు, మారిషా!

తే. వడిగఁ బుడమికి డిగియెడి బమ్మకొమ్మ, దారిఁ బడియెడియలజడి దలఁగు నట్లు
రామగుణకీర్తనామృతరమ్యవాపి, యందుఁ గ్రుంకక యుండిన నసువు మీఱ.

న—కుసుమితారామమ్మును దుమ్మెదలువోలె నేల యీకవు లందఱు రామునినే వెండియుఁ
గొండాడుచున్నారు ?

సూ—[విహసించి].

తే. తమ్ము నెమ్మది నెందునుం దనుపుఁ దమకు, సుగుణమణిగణ మిదుఁ గాన సుకవులెల్ల
నల్ల శ్రీరామభద్రుని యభినుతింత్రు, వారి కవి దోషమే గుణపర మగుఁ గద.

ఇదియునుం గాక, మారిషా!

ఉ. దేనికి సచ్చరిత్ర మను దివ్యము బీజము ప్రజ్ఞ మొల్కపై
జ్ఞానికకాండసంగతియుఁ గాండము గావ్యము సూత్నపల్లవం

బా నోగి సూక్తిపూఁతకవితావళిజం బది రామసత్కథా
నూనఫలంబు లేక మఱియు స్వితధీకృత మేనిచే నగున్.

ఎవండు వెండియు నీప్రబంధము చేతఁ గవితాకామినీకేళికర్ణపూరవిహారలీల ననుభవించుచున్నాఁడు ?

సూ—[పొలయలుకగా] మారిషా!

మ. ఎనయించుం దగ నేనివాగ్విలసనం బేణాక్షిబింబాధరం
బున కెంతే నధరత్వము న్మధురసస్ఫూర్తిం గవీంద్రుండు వ
శ్యను గన్నాఁ డతఁ డాలిధేయమును గౌండిన్యుండు నీపీనులక్
దినుసారం జయదేవుఁ డొందఁడో మహాదేవాత్మజుం డాదటన్.

మఱియును,

ఆ. లక్ష్మణునకుఁబోలె లలిసుమిత్రాగర్భ, జన్ముఁడై నయితనికి న్ముదమున
రామచంద్రచరణరాజీవమున భ్రమ, ద్భ్రమరభావ మొందు స్వాంత మరయ.

న—చంద్రచరితము నెఱుఁగని చకోరముయొక్కసరణి నెక్కరణి నే ననుసరించినాను ! భావ! ఈకవియే నాకుఁ దన కృతిపుస్తకమును సాదరముగ నొసఁగి యీచొప్పునం జెప్పెఁ గాపాడఁదగిన దిది పలుకుదొంగలవలననని. ఆయనయును నాచే సవినయముగ నిట్లు విన్నవింపఁబడియె.

క. పీనున నిడి యునిచి మెడక్, బూని తలం దాల్చి చేత మొనయించి యెదక్
స్తేనాపహారభయమునఁ, బూనికి నీపల్కుముత్తెముల నేఁ గాతున్.

సూ—మారిషా ! ఈయళీకళంక యాకవి కేల ?

క. సులలితవచనసువృత్తక్, లలనం గృతికొఱునిదాని లాలసుఁడై మ్రు
చ్చిలి యెవఁడే న్గడలికి న,వ్వలిదరిఁ జేరినను మేలు వడయునె చెపుమా.

న—భావా ! ఈతండు ప్రమాణప్రవణుండుగాను వినఁబడుచున్నాఁడు. కాన నే నిందు రేయెండ యెండలందువలెఁ గవిత్వతార్కికత్వములయం దేకాధికరణవృత్తిత్వముం గాంచి కౌతుకముఁ గాంచుచున్నాను.

సూ—ఇందేమి కౌతుకము ?

చ. గొనబగువాణి యెవ్వరిది కోమలకావ్యకలాకలాప యా
ఘనులకు డిందునే యరయఁ గర్కశతర్కవచోవిజృంభణక్
అనువుగ గోళు లుంచఁబడు నన్నులచన్నుల నేరి చేత నె
న్నను మదకుంభికుంభదళనమ్మున నమ్ముబువోవె వారిచేన్.

న—భావా! నిజకవిత్వతత్త్వవినోదమునిత్తు లీసభికు లెట్టికవియొక్క కవిత జొక్కుదురు ?

సూ—ఇది కలిగినదే. మారిషా! ఈతనిచేతనే చెప్పఁబడియె.

ఉ. చెందుచుసూక్తివైభవము చేతను సంతస మెంతయేనియుం
బొందుదు రన్యసూక్తులను మోదముఁ గొందఱునాథు లెందు మా
కందము స్వాలవాలమునఁ గల్గినచోఁ దా మకరందపూరముం
జెందఁగఁ గోరదే కలశజీవనసేకము సైకమేనియున్.

న—ఆహా! ఈతనిపలుకుల సరళతయుం మృదుళతయుం.

సూ—ఒక్కచో వక్రతయుఁ గఠినతయు.

న—[సకౌతుకంబుగ] ఎట్టిరెంటికి రామణీయకము ?

సూ—అట్లే. ఇట్లే యిక్కవిచేతనె వక్కాణింపఁబడినదిగద యిది!

ఉ. వక్రములం గవీశ్వరులవాక్కుల దూఱుదురేనిఁ బ్రాకృతుల్
వక్రముల న్మృగాక్షులయపాంగము లెన్నరయేని నీరసుల్
వక్రతఁ గోరదే బుధులస్వాంతము దచ్చతురత్వవిజ్ఞతన్
వక్రముఁ గ్రొన్నెలన్నిపుడు బల్విడిఁ జెల్వుగ మౌళిఁ దాల్పఁడే.
మఱియును.

చ. పరఁగ సుధాబ్ధియం దమృతపానముఁ బల్మఱు సేయుచుం బయో
ధరుఁ డుడురాజము ల్వఱపు ధారుణిపై వడగండ్ల నవ్వియుం
గరకలు గ్రాలెడు న్క్షణముకాలమునం గఠినంబులై యటే
నిరతసుధోద్గిరంబులుమనీషులసత్ప్రతిభోక్తు లొప్పెడున్.

న—యుక్తము. ఈకవి కంఠగకరణ మేమో ప్రమోద మేదురము. అందువల్ల సుధాశీతలంబులు సూక్తు లుల్లసిల్లుచున్నవి.

సూ—ఉ. చేనికిఁ జోరుఁ డౌఁ దుఱుము ధీరమయూరుఁడు గర్ణపూర మా
లేన్నగ వౌను భాసుఁడు పరిష్వవిలాసము గాళిదాసుఁ డౌ
నా సరయంగ హర్షుఁడు సుహర్షము బాణుఁడు పంచబాణుఁ డౌ
నేనికిఁ గాద దిక్కవిత యిష్టవధూమణి కౌతుకాప్తికిన్.
మఱియును.

ఆ. కాదు బ్రహ్మవిద్య గాదు రాజ్యేందిర, గాని కవుల కవును గవితలలిత
జోక నిడఁబడుచును లోకోత్తరునీకయి, తూఁతురీతిఁ గూర్చుఁ గూర్మిఁ జేర్మి.

[నేపథ్యమందు.] బాగోయి కుశీలవోత్తంస బాగు.

సూ——ఆహా! యాజ్ఞవల్క్యశిష్యుఁడు దాల్భ్యాయనుఁ డితఁ డిక్కడనే యున్నాఁడు. వ్రతమును బూనినవాఁడును, శూద్రులఁ జూడఁగూడనివాఁడును నగు నితనియెదుట నిలుచుట మన కనుచితము. కనుకఁ దొలఁగుదము. [అని నిష్క్రమించిరి]

ఇది ప్రస్తావన.

---

[తరువాత దాల్భ్యాయనుఁడు ప్రవేశించుచున్నాఁడు. కాదు బ్రహ్మవిద్య యను నా పద్యము నే పఠించి] ఇట్టే యిది. అట్లుగదా; ఈరాజు జనకుఁడును సకలజగజ్జనయన నళినద్యుమణి యవు నొకానొక పురుషమణికిఁ దనదుకన్నియ నొసఁగ నెన్నికఁ గన్న వాఁడై మాగురువుచే నుపదేశింపఁబడిన బ్రహ్మవిద్యయందును, కులక్రమాగతమైన రాజ్యసంపదయందును, బొత్తిగా నాదరములేనివాఁ డాయెను. [చెవి నిచ్చి] ఎక్కడి దిది వింగి నీవిణియయొక్క మ్రోఁత? [విమర్శించి] తగును. మాగురువును జేరవచ్చువాఁడును, వాతావాతకలక్వణితవీణాగుణుండును, వేల్పునిరాబారిమున నైన నారదునిచేతఁ గలిగినది గాఁబోలు. [మీఁదుసూచి] ఆహా! శబ్దసామ్యమువలన మోసపోతి ఇది కమ్మనిపలుకులఁగల తుమ్మెదకవయా? [వెండియు నాలకించి, సహర్షకౌతుకంబుగ] ఆహా! భగవంతుఁ డగు యోగీశ్వరుని యనుగ్రహమహిమ! దేనిచేత నే నిటువంటి వానియొక్కయు మాటలఁ దేటపఱుచుకొనునట్టి యుత్కృష్టసిద్ధిఁ బడసినాఁడనో! కనుక నివి పలుకుపలుకుల నన్నిటి నాకర్ణించెదనుగాక. [ఆలకించి] ఒక్కఁ డేమి వక్కాణించెను? చెలికాఁడా! కలాలాపుఁడా! ఎక్కడనుండి వచ్చినాఁడ వని యడుగఁబడుచున్నాఁడవు? మఱియొకఁ డేమనెను? చెలీ! మధుప్రియా! అనవరత వికసనంబగు నమృతకరధర కపర్ద మంజుల మందాకిని కమలవనమువలననుండి నేను వచ్చినాను.

దా——ఆహా! వీనిపలుకు వినూత్నమును, పేరుపొందికయును, [మఱియు నాలకించి] కల దొకానొక క్రొత్త వార్త. కలాలాపుఁ డే మనియెను? కలదుగదా, ఒకానొకప్పు డుత్ఫుల్లకమలమయం బగు దండ నొసఁగి దండమిడి సుప్రసన్నుఁడైన సుధాకరమౌళితో వేయిచేతులబలియుఁడు బలినందనుండు బాణుం డిట్లనియెను. దేవా!

ఆ. లంకఁ జేనికయి బలంబునం బలమఱు, వెండికొండకంటె వెలయుబలిమి
గలుగు నెద్ది ముజ్జగంబుల నే నందు, సఫలముగ నొనర్తు సద్భుజతతి.

వక్కాణింపఁబడియె ముక్కంటిచే.

క. కల దది నాయది దివ్యము, విలు మును పుసుపఁబడె జనకవిభునొద్దఁ బురం
బులు మూఁడు మిడుతతనమును, జెలంవఱఁ గనె దేనిములికి చిచ్చున మెచ్చన్.

అది విని తన వేయిచేతులం జూచుకొనుచు, బాణుండు బయలువెడలె. నేనును వేఁ తోడ నిచ్చటికి వచ్చినవాఁడ. నీ వెక్కడనుండి యిక్కడికి వరుగుదెంచినాఁడ . వెండియు వాకొనుము. అచ్చటి వృత్తాంత మెటువంటిది? [చెవినిచ్చి] సఖప్రియ డేమి వాక్రుచ్చె ? నేను వాసవుని వనమువలననుండి వచ్చినాను. అందు నాచే నొ నొక నిశాచరుని గర్జిత మిది వినఁబడినది. ఓరోరి ! తోఁటవాండ్రారా ! రాత్రిం చక్రవర్తి రాజమాళినిఁ బూజింపకయుండ, నెట్లు కోయఁబడిన కుసుమములఁ గల నందనవనము ? వారిచేఁ బలుకఁబడినది. ఓఁయి లంకమన్నీనిలెంకా ! ఇది మన్నింపఁ నది. ఇపుడు, జానకీ స్వయంవరావలోకనోత్సుకిత సకలసురలోక విమాన వితానవ కై సేఁతకై మిక్కుటమవు పువులయొక్క యక్కఱగద ? అది యాలించి, వాఁ వార్తయే లంకేశునకుఁ బూల కానికగా నొనర్తు నని చనియెను. నేనో వినోదంబ నిచ్చటికి వచ్చితి.

దాల్భ్యయనుఁడు—[సహర్ష కౌతుకంబుగ] ఆహా ! ఏమో క్రొత్తవృత్తాంతరహస్యం. మధుకరద్వయమువలన నాచే వినఁబడినది. [ఆలోచించి] అయ్యో ! ఇయ్యది పె పెదదనుఁ బుట్టినట్టి మొలక. ఎట్టులన్న, ఈ సీతా స్వయంవర వార్త, బాణ రా ణులయొక్క చెవుల కెక్కినది [నిరూపించి] ఒక్కపక్షంబున న్విషాదం బక్కఱలేద భ్రమరోక్తులు భ్రమారోపితంబులుగాను సంభవించుచున్నవి. [వెండియు విచారిం ఇవి భ్రమరమాత్రకములు గావుగా ? ఎట్టన్న,

క. మందేతరవరరసని, ష్యందమహోదారసుందరాలాపంబుల్
వందులవలెఁ గన శ్రవణా, నందకరంబు లివి నెలఁగు నరు లరుదందన్.

[నేపథ్యమందు,] మునీ ! యుక్తముగా నూహించితివి. మేము వందులమే కదా ? పఁ దెసలనుండి వచ్చిన పఋవుల గొనములగముల నెన్నఁగ జనకరాజుచే నియోగింఁ బడినవారము.

దా—[తనలో] ఆహా ! మహోత్సవము ! నావచన మెది తుష్మైద దోయిచేఁ జిగిరి నదో, యది వందిద్వయముచేఁ బండినది. అందువలన నొదవినది సీతాస్వయంవరా సరము. కావున నేను భ్రమరవృత్తాంతమును గురువునకు విన్నవింతును. [అ నిష్క్రాంతుఁ డయ్యె ]

ఇది శుద్ధ విష్కంభము.

---

[అంత వందు లిరువురు ప్రవేశించుచున్నారు.] వారిలో నొకఁడు——చెలికాఁడా! నూపుర కుఁడా! చూడు చూడు.

క. శ్రీతిం దమతమదిక్కున, భూతలపతు లున్నవీరపుంజము బొలుచున్
సీతాస్వయంవరముఁ గనఁ, గౌతుకముఁ గూడివట్టికడలగమి యనన్.

నూ——సెయ్యుఁడా! మంజీరకుఁడా! చూడు. అ. ఇయ్యెడ, పలుగొమ్ములపెగమ్ముల కొమ్ముల ననుప్రగమ్ములచేఁ జేయంబడిన గద్దెలందుఁ గూర్చున్నవారును, కెంపుమై పూఁతలం గలవారును, పైనతెత్తు వెచ్చనటుంపుమెడలొట్టిన సన్నటి బంగరు సింగంబులవోలెఁ గ్రాలుచున్నారు. మఱికొందఱు బాలపెల్లి పెల్లువగొనలం గ్రొత్తగ న్నిగుడుచున్న వెన్నెలతేనె చాయలో యన మెఱయుచున్నారు.

మం——చూడు. అ.

చ. వరనటకంచళాఖ పరివర్తితసూత్రవలగ్నరైన యీ
ద్విరదరదోరుమంచకృతవిభ్రమపుత్రిక యాడు నిత్తఱిన్
ఖురరిపుచాప మెక్కుడఁగఁ బొంపిరివోయెడు పేర్కు నిక్కు భూ
వరులయతిత్వరాన్వీత విభావనమైనది చిత్తవృత్తిచాన్.

నూపురకుఁడు——ఓయీ! సెయ్యుఁడా! ఇతఁ డెవఁడు? మఱకంటివంటి చెక్కుడుట యందలి మిక్కుటంపు పెద్ద యసెడు నామనిలబ్బచే విచ్చిన గసుర్పు మొగ్గల గమిచేఁ గైసేయఁబడిన తనబుజమ్ము లనెడు తియ్యమామిడికొమ్మదోయిం జూచుకొను చున్నాఁడు.

మంజీరకుఁడు——స్వకీయ యశస్సుగంధసముత్సుకితచారణమధ్బరణకులకలకలముఖరితదిగం తుఁడు కుంతలాలంకారుఁడు మల్లికాపీడుఁ డను పేరుగలవాఁ డీతఁడు.

నూ——రెండవయం నితం డెవండు? దవ్వుగ సొగఁద్రోయఁబడిన బంగరుకడియముచేతఁ దెలుపఁబడిన తన సింగాణిగొనము తాఁకులవలనం గలిగిన కాయలచాయచే నంద మైనభుజమును గనుఁగొనుచున్నాఁడు.

మం——ఈతఁ డుత్తరదిజ్మత్తకాశినీఫాలఫలకాలంకారుఁడు కాశ్మీరతిలకుఁడు.

నూ——మఱియుం నెవఁ డితఁడు? మగఁటిమి కలిమి గందపుఁజెట్టుకొమ్మకుఁ బుట్టపుట్టు వపు కత్తిఁ బట్టుకొని యున్నాఁడు.

మం——స్వప్రతాపప్రభాపటలపాటలితమలయాచలనితంబమండలుండు కాంచీమండ నుండు వీరమాణిక్యుఁ డని పేరువడసినవాఁడు తేఁడు వీఁడు.

నూ——మఱి యితఁ డెతఁడు? ఎడయని గసుర్పుగల చెక్కిళులఁ గదలు పోగులఁ దాల్చ

చాపమున వెల్లడిపఱుపఁబడిన ముక్కంటివింటివిని వీనుసొమ్ముగం గావించుకొనుటయం
వేడుక గలవాఁ డగుచు వెలయుచున్నాఁడు.

మం.—వీఁడు, అసమసమితి మహార్ణవమకరము మత్స్యరాజు.

సూ.—వెండియుం వీఁ డెవండు? గంధపుఁబూఁతచేతఁ దెల్లనైన తనభుజములచేఁ బోఁ
బడిన చిలువతోడిమేనిజిగి గలవాఁడు. పైఁడికొండవింటిదంటవింటిం బూవువంటి
యెన్నుచు నిలుచున్నాఁడు.

మం.—వీఁడు, స్వచ్ఛమౌక్తికహారాలంకృతవిశాలోరస్స్థలుండు నుత్తుంగదోస్తరంగుఁ
సింధురాజు, [మఱియు సకౌతుకంబుగ,] చెలికాఁడా! చూడు వీరిని.

గీ. కడఁకముక్కంటివింటి నెక్కిడెడువేడ్క, రోమహర్షణమ్ముం గల రుచిరబాహు
లవనిజాలోకనసుకుతూహలవికటిత, హృదయము లగుచున్నవారు తేం డ్లెల్లయెడ

సూ.—[చెవినిచ్చి] నెచ్చెలీ! తెలియఁబడని యింపయిన నిబ్బరపుఁ బెనుగ్రందిదేది?

మం.—క. దివిజేంద్రచాపయుతమై, ప్రవర్షణమునను జనుఘనవర్గముధ్వని నా
శివుసింగాణిం గొనివచ్చువరమదేభములయులివు సుమ్ము చెలంగున్.

ఓయీ! శంకరకర పరిమండిత కాండాస మెట్లు తేఁబడె? [వెండియుం జూచి] ఓయి
అద్భుతరసైకతాండవరంగమండపము కోదండరత్న మిది.

[illegible]
తుప దగునూప్పగాడ్పు వ జొప్పడ ఘోరవిషాగ్నికీలలీ
లను లలిగాలఁ బాస్త్రయువలద్భసితంబును జోపనోపె దే
నను వెలంపడ్డమ ఉల్కలఘునంబగుగాడుపు ఘోరఘోర మై.

సూ.—ఓయీ! ఎందు సువర్ణమయపత్త్రపత్త్రిభావమును సుపర్ణరథుఁడు గోవిందుఁ
పొందె నని బృందారకులచేతం దలఁపఁబడెనో, అదియ యిది త్రిపురవినాశక
కార్ముకము.

మం.—చుట్టు దిరిగి, రాజులారా!

శా. ఆకర్ణంబుగ నీడ్చుసీహారధనుర్జ్యావల్లిజ్యామండనుం
డేకల్యాణగుణుండు వానికడకే యింపొందఁగ న్వచ్చుఁ దా
త్మాకాంతాత్మజ మందయాన దరహాజత్కాంచికాశ్రోణియై
యాకర్ణాక్షిమహోత్సవంబుకొఱ కాహా భాగ్యమెవ్వానిదో.

[విలోకించి] ఓయీ! సమయసంచారసమ్మిళద్గండస్థలకర్షణమసృణరణరణన్మణిమండ
బగు రాజమండలం బెట్లు కదలెను? [విహసించి]

గీ. కనుకనుమి పెల్లడిగ విలుకాంద్రచేత, భక్తియే చూపఁబడినది శక్తి గాదు
చేయఁబడిన దంజలిముష్టి సిద్ధి గాదు, తలయె వంపఁబడినయది ధనువు గాదు.

సూ—నవ్వుచు సంస్కృత మాశ్రయించి, ఓయీ! ఋూరగచెట్లపూఁతవలె వీరియారంభ సంరంభ మెట్లు ప్రవర్తిల్లెను? ఎట్లనఁగా,

ఉ. కొందఱు దవ్వునం గనియుఁ గొంద ఱిదెం తని చెంతఁ జేరి వే
కొందఱు దాఁకి లిన్నఁగను గొందఱు గౌఁగిటఁ జేర్చి గట్టిగాఁ
గొందఱు కట్టి చేకొలఁదిఁ గొల్పి స్వదోర్బలమెల్ల నల్లనం
గొందఱు శైవ మీవిలు దగుంద్రిదశాద్రి యటం చెనంగిరా.

[సవిషాదంబుగ]

శా. నానాద్వీపములందునుండియును నృపు ల్నల్వొందఁగా నందఱున్
రాజా రీయెడ నేని కానో యశ మన్న న్వొండిడాల్గన్న దీ
చో నేఁడుం గదలింపఁడయ్యె ధనువుం జూ వంపలేఁడయ్యెదున్
హీనత్వంబును గన్న దయ్యెనె యహో యీయుర్వి నిర్వీరమై

[నేపథ్యమందు]—ఆ! ఎవఁడు వీఁడు విపరీతవై తాళికుఁ డొకవిల్లు వంపఁబడమివల్లనే నిర్వీర ముర్వీతల మని న్యపదేశించుచున్నాఁడు?

సూ—[భయముతో] నెర ్బ డా! త్ర్యంబకతుంట సంచచ త్రైస్నాహ కేయస్యంపనధ్వని కరోంను కంర ధ్వానము వినఁబడుచున్నదే.

మం—చెలికాఁడా! నేను నెఱిఁగినవాఁడం గాను. కాన, వీని నడిగెదను [పరిక్రమించి] ఓయీ! నీ వెవఁడవు అన్నిసీమలం ద్రిమ్మరు నాకుం దెలియఁబడనివాఁడవు?

పురుషుఁడు—[ప్రత్యవేంచి] గర్వముతోఁ బరిక్రమించి [క్రోధముతో]

ఓరీ! కొన్నియూళ్లు ద్రిమ్మరు దుర్విదగ్ధవై తాళికుఁడా! ఎట్లు నన్నును దశ [అని యర్థోక్తియందు], [తనలో సాశంకంబుగ] ఆ! దాఁచఁదగినదాని వెల్లడింపఁ దల పడితి. కానీ. దీనినే నిర్వహింతును [ప్రకాశముగా] ఎట్లు నన్నును, దశదిగ్వర వర్ణినీకర్ణపూరీకృత కీర్తికిసలయునిన్, త్రిభువనవీరనామధేయునిన్, నూతికప్ప మున్నీటి నప్రసిద్ధ మన్నట్లు పలుకుచున్నావు? అదంతయుం జెప్పుము. కర్ణాంతనివేశ నీయగుణం బగు కార్ముకరత్నమును గన్యారత్నము నెక్కడ?

మం—ఇద్దియే యద్ధనువు కన్యామణినో పిమ్మటఁ జూడఁగలవు.

పు—ఛీ! మూర్ఖుఁడా! రాశి నక్షత్ర పాఠకుల గోష్ఠినే నెట్లు చూడవైతివి? వారును గన్యనే మొట్టమొదటఁ దెలుపుచున్నారు. పిమ్మట ధనువును.

మం—తనలో, ఎట్టితఁడు ప్రల్లదనము నే వెల్లడిచేయుచున్నాఁడు? కానీ! ఇందుచే
యీతని కొంతయు వారింతును. ప్రకాశముగా నవ్వి, ఓయీ! పరివారమునం
నీవే నక్షత్ర విద్యాకుశలుండవు.

పు—ఆ! నే నెట్లు నక్షత్రవిద్యాకుశలుండను?

మం—విల్లెక్కిడకయే కన్యావలోకనమునకు నెక్కడని స్సముత్కంఠితుఁడ వవుచున్నా

పు—నాకును జాపారోపణమున సంశయమా?

మం—ఔను.

పు—ఎందువల్ల నిది యుత్ప్రేక్షించుచున్నది?

శా. విద్యుల్లేఖ ఘనంబు లేకయె దివి న్వెల్గించుచు న్నాతకుం
ఖద్యోతప్రతతిం గడు న్వెలిఁగెడు న్బల్వింతగా నెంతయు న్
హృద్యంబైనది దైవతాపగయు లే కెంతే నభోదేశమం
దుద్యత్సద్యుతి మేచకోత్పలవనంబు న్మస్తకాలోక్యమై.

[మ్రోలఁ జూచి, తనలో]. నా ప్రతిజ్ఞాభంగమునకై విధిచేత విపరీతసృష్టియై పు
వెట్లు ప్రకటింపఁబడియె? ముం దిదియా? [విద్యుల్లేఖ ఘనంబు లేకయె ం
పద్యంబుం బఠించి విమర్శించి] అటు గాకున్న మత్ప్రతిజ్ఞాభంగమునకై యీ
యొవఁడు?

మ. అలదుగ్ధాబ్ధిని నున్న వెన్నునికి యూనంగాపునాభ్యబ్జి న్
జెలువొంద న్నిజవాపికాకమలినిం జేయ న్మదిం గోరి యం
కిలిశంక న్నలు మోములం బలుకు వీక్షింపంగ నాదైన య
ర్మిలికై తియ్యనిపల్కులం బలుమఱు న్మేలొందఁగా నీతఁడున్.

[నిపుణంబుగ న్నిరూపించి] ఆహా! సాదృశ్యముచే మోసపోతిని. ఎట్లనఁగా;

ఉ. కాదిది మించు మేఁడపయిఁ గ్రాలునొ కానొకచాన మేనిడాల్
గా దళుకొత్తెడుంబసిఁడి కమ్మిగఁ గల్వలతోఁట మేటియుం
గాదు సమీనఖేలనము గన్నను దన్నయనావలోకమే
కాఁదగు నబ్బురం బహహ కాంత యి దేనికిఁ గాంతయా నొకో.

ఓ నిది సీతానామధేయము గలది కన్యారత్నము! [నిర్వర్ణించి]

మ. వనజం బామెనెదీవు వ్యర్థముగ నో షడ్డారి యీనారిపా
దనఖం బేనియుఁ బోలఁజాల విఁకఁ దద్వక్త్రంబునుం బోలదే
వనితారత్నముకన్నుదోయి యెదుర న్వర్తిల్లదే జింకఖం
జనమా నీవు జనాభిరంజనము మెచ్చం జేయఁగం జాలుదే.

[వెండియు సవిస్మయంబుగ]

ఉ. ఒకటి సృజించె వేధయె పయోధిని దుగ్ధమయంబు దేవుఁ డిం
కొకఁ డుపమన్యుఁ డత్తపసియున్ సృజియించెఁ దపంబు సల్పి మున్
బ్రకటముగాఁగ నిప్పుడు వరంబుగఁ గేదఁగిరేకువంటికం
టికిఁ దుదచూడ్కి నీసతి ఘటించును బెక్కుటిఁ బాలసంద్రముల్.

మం—నెయ్యుఁడా! నూపురకుఁడా! ఒకానొకతె చేతివలనఁ గైకొని యిదేమి యంతః
పురికాజనము సకౌతుకంబుగ నాలోకించుచున్నది?

నూ—గురుగృహమునుండి వచ్చుచున్న యంతఃపుర పరిచారికయగు చంద్రికయొక్క
చేతివలన గ్రహించి చిత్రపటమును జూచుచున్నది యని నే నూహించుచున్నాను.

మం—నీచేత నాచిత్రపుఁ బటము చూడఁబడెనా?

నూ—ఆ! (చూడఁబడెను.)

మం—అం దేమి వ్రాయఁబడి యున్నది? అది తెలుపు.

నూ—రాచకూఁతురు (సీత), మఱిలాఁతివాఁ డెవఁడో నల్లగలువవలెఁ జామనిచాయయును,
మెదువునయిన మేనుగలవాఁడు, తనయంతం దాన యందగాఁడు. కౌనవెవిసొమ్ముగఁ
గావింపఁబడిన ముక్కంటివిలింటి గుడుసుగలవాఁడు రాజుకొడుకు.

మం—అహాహా! ఈ స్త్రీజన మతిముగ్ధము. ఎందువలన నన, రాజతికరిత ప్రతిజ్ఞగలవాఁడు
గాఁగా, చిన్ని యీడుగల యల్లుని (పెండ్లికొడుకును) గోరుచున్నది. [వెండియు
సాకూతంబుగ] ఈ పట మెవనిచే వ్రాయఁబడిన దని యెఱుఁగుదువా?

నూ—ఓయీ! భగవంతుఁ డైన యాజ్ఞవల్క్యునిద్వితీయద్వితీయచేత నని దీని నెఱుఁ
గుదును.

మం—ఇపుడు కోరిక మొలకరించినది.

నూ—ఎట్లు?

మం—దేవి మైత్రేయి త్రికాలదర్శిని సిద్ధయోగిని దబ్బుఱ వ్రాయదు.

నూ—[నిట్టూర్చి] సబాహుచేఁ గట్టడియగు వీఁ డిటుఁ దోలఁగెనా; అంతయుఁ దలఁపఁ
దగినదే.

మం—హా! వీ డేఁడు? వీనిని దోలఁగింతు [నని యంతటం గలయఁ దిరిగి] ఓయీ! ఈ
వల నావల నేమి విలోకించుచున్నావు? ఇది యేమి కోదండము గాదా? ఔను గాన
నిందే దృష్టి యుంపఁబడందగు.

పు—ఆ! దృష్టి యని యేమి చెప్పుచున్నావు? ఓయీ! ఇది ముష్టియే యీయఁబడు

చున్నది. [ససంరంభంబుగ, సంపరిక్రమించి, శేఖరభ్రంశ మభినయించి సవిః
ముగం గాంచుచున్నాఁడు.]

క. ఓలంకేశా విగళిత, చూడాలోకనముచేతఁ జూ చనెడుఁగదా
కాలంబు గావున న్వే, కూలిది విల్లందికొమ్ము కూరత మీఱన్.

పు—[తనలో], నే నెట్లు వీనిచే నెఱుఁగఁబడితిని? అటుగాదేని, ఘుణాక్షర న్యాయ
సారముగ శబ్దసామ్య మాయది. [ప్రకాశముగా]

గీ. హేలమెయి నారినిం గట్టి యెక్కువెట్టి, కూలివిలు మేలుమే లనఁ జూడఁబ
నేను బూనిన నిది యెంత పూన నడ్డ, మేమి యుండెను నీదారి హితమం

[పరిక్రమించి, తనలో] అయ్యో! ఈ ప్రతికూలశకునశంకువుచే శైలచాప
రోపణముకొఱకు నాభుజబలము కట్టఁబడిన ట్టయ్యెను. దీనిచే నేమి? [ప్రకాశం
ఓయి! ధను వన వంకరయే పద్ధతి. కావున సరళమైన కరవాలధారాపథ
సీతం బత్తును.

మం—ఓయీ! వీల ప్రాగల్భ్యములఁ బలుకుచున్నాఁడవు? చూడవా యేమి?

తే. భూరిరోషారుణాక్షిశోభోరుభిన్న, భ్రూవిభంగవిఘటిత సుభ్రుకుటియుతము
కోశనిర్ముక్తనిస్త్రింశఘోరబాహు, దండచండంబు నరవీరమండలంబు.

పు—[కత్తిదూసి చుట్టుపట్టఁ జూచి], చూడు,

తే. దారితారిద్విరదకుంభతటవిముక్త, మౌక్తికసుతారకితనభోమండలరుచి
కాళరాత్రిపలెనె యెదిక్రాలుసాల,మున నదిది నాదుకైదువు భూపులార.

[ఆకాశంబునఁ జెవి నిచ్చి] యేమి చెప్పుచున్నారు? ఓ.

తే. ఒకఁడెఁ బెక్కండ్రతో నెట్టు లోపుదు నని, నలువ నని వగ మానుము తలఁతు
జయమునదియొనర్పు చిత్తమనమరమునను, బూన్కిసమరేఖచే నిందుఁబొందుఁ

ఆహా! మానిసిపురుగులదిట్టతనము? కాఁబట్టి స్వాకారముచే వీరి న్వెఱపించుచున
[నేపథ్యమందు]. [అని, నిష్క్రమించెన

చ. అమరసరిత్సువర్ణజలజాంచితభూరిబిసాంకురంబులన్
సమదదిగంచితోల్లసితసామజసద్ధళనాంకురంబులన్
భ్రమదముచేత నేయవి పరంగను బీఁకుటఁ బాపె బాలభా
వ మవి మదీయబాహు లివి బాగుగ సత్ప్రకటీకృతంబులా.

[అంతట స్వరూపముతో దశాస్యుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

సూ—ఖేలికాఁడా! చూడు. ఓ. అచ్చెరియము. ఓ, ఒకమానిసికిం బదితలలు.

మ—వయస్యుఁడా! వీఁడు మనుష్యుఁడు గాఁడు. ఐన, రాక్షసరాజు.

నూ—[భయముతో], కావున నన్ను చూచినేస్తకాఁడు కాపాడవలయును. ఓయీ! రక్కసుఁడే తన కెదురుపడిన మానిసి నెక్కుచున్నాఁడు. పెండియు రక్కసుల యొడయుండవ ఁడేల?

మం—[నవ్వి] చెలీ! వెఱ్ఱి నేల? నిఖిల నీరచరముచే నభినందింపఁబడినదిగదా, వంది జాతి? అందువలన, భువనైకనాయకుఁడైన యీ నిశాచర చక్రవర్తి మనవంటివారి వినయమున నెట్లు విపరీతవర్తనము సేయఁగలఁడు?

కావున నిర్భయముంపనైన [illegible] ఓహో! ఇన్నితల లేమని మోఁచుచున్నవి? [illegible] ఒక్కటి త్రోసి [illegible] యెక్కడనేని విడవఁబడ కుండవు?

రావణుఁడు—[సక్రోధముగ] హా? ఓరి పాపుఁడా! అస్థానమందు నాకు శిరశ్ఛేదనము దెలుపుచు నాకమంగళమును బలుకుచున్నావు. నీవు వైతాళికుఁడవు కావున బ్రతికి యున్నాఁడవు.

మం—[నిరూపించి] ఓయీ నక్కంచరుఁడా! స్థానమందైనచో మాత్రము మస్తకచ్ఛేదంబు మంగళమున కెట్టగు?

రా—ఓరీ! స్థానమందైన [illegible]:

క. ఘనవిద్యాధరవనితా, జనకరవిన్యస్తకుసుమచయసంకీర్ణం
బున శివచరణమునకు రణ[illegible] వలసిన నెగుట నాకు మొగి మంగళమే.

నూ—నీ విట్టివాఁడవైన నెందువల్ల నిపుడు నిజరూపమును గోపనము సేసి ముచ్చువలెఁ జొచ్చినాఁడవు?

రా—ఛీ! మూర్ఖా!

క. పురహరగిరిసంచాలన, వరశక్తిసమన్వితములు బాహులు నావీ
గురుభుజములచేఁ బట్టిన, శరాసన మొకఁ డెక్కిడ నెటు సైఁతును లజ్జన్.

దీనిచే నది చాలును. జానకి యెక్కడ? వక్కాణింపుము.

మం—అపవారించి (మఱుఁగుసేసికొని) నెయ్యుఁడా! నూపురకుఁడా! అప్రతీకార మనర్థము. మఱియును [సవిషాదంబుగ.]

చ. అగుఁగద యాజ్ఞవల్క్యుఁడు మహాముని నీకులసద్గురుండు నీ
కగుఁగద తండ్రి యజ్ఞనకుఁ డంచితుఁ డంబ ధరిత్రి యట్టి నీ
వగుదువయో పలాశనకరాంకగ దుర్విధివైశసంబునన్
సుగుణరో బిడ్డరో యిపుడు శోకముఁ బొందకయుండ శక్యమే.

నూ—సెబ్బెలీ! దిగు లొందకుము. ఈ రాచబిందునం దెల్ల నొకం డైనను, తగనిపనికిఁ బూనిన వీని కెదురుగ నిలువఁగలవాఁడు లేఁడా?

మం—[నిట్టూర్చి] క్రోధోద్ధతుఁ డైన దశకంఠునకు సహస్రబాహుం డైన కార్తవీర్యుని కంటె నన్యుఁ డైన క్షత్రియుఁ డెవ్వఁ డభిముఖుఁడవు?

నూ—[సహర్షంబుగ] బ్రదికితిమి. ఆ. అదె వేయిచేతులు గల కృతవీర్యసూనుఁడు వచ్చెను.

మం—[విహసించి] ఇస్సీ! తెలివిలేనివాఁడా! పరశురాము కఠోరకుఠార ధారాజల నిమగ్నుఁ డైన యర్జును నిపు డెట్లు చూచుచున్నావు?

నూ—ఓరీ! దబ్బఱ చదువరీ! ఎట్టయెదుట నున్నను లేన ట్టెట్టు వాదాడుచున్నాఁడవు? ఓయీ! ముందర వీఁడు వేయిచేతులవాఁడు చూడఁబడుచున్నాఁడే, చూడు.

మం—ఔను. వీఁడు బాణాసురుఁడుగా నుండవచ్చును. [భయముతో మనస్సునందు] కనుక, ఇది మఱియొక యనర్థ మంకురించినది. [విమర్శించి] అది గాకున్నను, విష మునకు విష మౌషధము గాఁగలదు.

బాణాసురుఁడు—[ప్రవేశించి, గర్వముతోఁ బరిక్రమించి] చిరకాలమున కిప్పుడు,

క. కైలాసముకంటెం గడు, సారతరం బైనధనువు శర్వునిదిది నా
కేలం గుసుమసమముగఁ, గ్రాలం గావింతు భుజవనము సఫలముగన్.

రా—[వినఁబడమిచేత] ఓయీ! ఇప్పుడును సీత రక్షింపఁబడకున్న దేమి?

బా—[చూచి, తనలో,] ఇక్కడ దశకంఠుఁ డెట్లు వచ్చె? అగుఁగాక. [ప్రకాశముగా] ఓయీ! ఇంత శూరవారమందు శివనిచేతఁగాని యీ సింగాణి యెక్కిడఁబడ దయ్యెనా?

మం—ఎక్కిడఁబడదయ్యెడు.

రా—[చూడఁబడమిచేత.] అందువలన నాదు చంద్రహాసమే సీతను రక్షించును.

బా—[విహసించి] నీ వీరలక్ష్మీవిలాస మిటువంటిదేని, విల్లెక్కు పెట్టకయే సీతను రక్షింప నేల?

రా—ఆ! పొల్లు ప్రల్లదము లాడువాఁ డెవఁడు వీఁడు?

గీ. చండబాహుదండచలితహరాచల, కీర్తికాలి నగుచుఁ గెరలునాకు
బాలబిససదృశము బాణాసనము నెక్కు, పెట్టుకొఱ్కఁగలుగు నెట్టి దనము.

బా—ఇది యశక్తి పర్యాయోక్తి.

రా—ఆ! ఓరీ! ఈ దశవదనునికిఁగూడ నశక్తిసంభావన యెట్టు?

బా—[నవ్వి] ఓయీ ! బహువదనత్వము బహుప్రలాపితకు హేతువు. పరాక్రమమున కు బహుబాహుత్వమే.

రా—ఓరి ! ఏల ? పలాలజాలమువోలె నిస్సారమైన నిజభుజసారముచే వీరంమన్యుఁడ వవుచున్నాఁడవు ?

బా—పలాలజాల నిస్సారమా, నా భుజసారము ? [బాహువులం జూపుచు] ఇక్కడఁ గదా ?

శా. పాతాళంబున కేఁ, లంద్రిపై పహాజ్జన్వోద్వసుం హెచ్చి సం
ప్రీతిన్ మ్రొక్కఁగ నిస్సహాయు లట నాకేశులం దాల్చ యా
ధాత్రి న్నిర్గతభారసర్వఫణుఁగం దద్దందశూకేంద్రు సం
ప్రీతుం జేయఁగనైతిఁ గూర్మకిటిదిగ్వేదండముల్ ప్రొక్కఁగాన్.

రా—ఓరి బలితనయుండా ! చలితనయుండవవుచున్నాఁడవు. ఎందువలన నసత్యవిక్రమవర్ణనచే, సత్యవిక్రముఁడవు లంకేశ్వరు సమక్షమున నిన్నుఁ బొగడుకొనుచున్నాఁడవో, అందువలన.

బా—మఱి నీ వెట్లు సత్యవిక్రముఁడవు ?

రా—ఆ. చంద్రచూడునగముఁ జదలఁ జెండాడి, నాఁగఁ గేళి చేసె నాకసాప్ర
తిష్ఠ పీఠిమ్మ దిక్కులోపంబులా, మస్కరాన లమిహీను మది నెఱుఁగవు.

బా—ఈ వ్యర్థ సంగ్రహణముచే నేమి ? ఓయీ ! మన యిరువుర బాహుసారతారతమ్య పరీక్షయం దీశరాసనమే త్రాసు గాఁగలదు.

రా—అట్లగుఁగాక.

మం—ఓయీ ! నరవీరైకసమర్పణీయ జానకీవివాహమనోరథముచేతఁ జేతోమార్గ మేల నలఁగింపఁబడుచున్నది ?

బా—క. శివధర్మ మెక్కుపెట్టుట, యవనితనయ నేను బెండ్లియాడుటకై కా
దు బహుళదోర్వ్యాయామబల, ప్రపరత ప్రథితముగ దెలియఁబఱచుటకొఱకే.

రా—క. శివగిరిశిఖరముఁ బెఱుకుట, సువిదితమస్మద్భుజబలసుపరీక్ష యిదో.
శివధనురానమనక్రియ, యవనిజకుచయుగళకేళి కాసక్తిసె యా.

[నేపథ్యమందు,]

క. ఎవఁడేని సురాసుర మానవకిన్నర సిద్ధచారణ ఖగాహులలోఁ
దివి చెక్కుడు సీధనువుక్, దవువాఁడు మదీయసుతకు ధవుఁడుగ నుండన్.

రా—[సహర్షంబుగం బరిక్రమించి చేతులఁ జూచుకొనుచు,]

# ఆంధ్ర ప్రసన్నరాఘవ నాటకము

## ద్వితీయాంకము

---

[తరువాతఁ దాపసుఁడు ప్రవేశించుచున్నాఁడు]

[ముందు చూచి] ఆహా! పెక్కులు చిన్నపిల్లలతోడఁ గూడుకొనుటవల్లం జెల్లుగ జామనిచాయ గలిగిన పసరువన్నెతీఁగల మేలుకట్టుచే బాగుమీఱిన పూఁదో« యొక్క వాటమైన యునికిగల యీప్రదేశము నాయుల్లమును జల్లఁజేయుచున్నది [ముందు చూచి] ఈ భిక్షు వేల దండనుండెడు? [బిగ్గఱగా] ఓయి భిక్షూ! ఇక్కడ

భిక్షువు—[ప్రవేశించి] తాపసున కంతయుం గుశలమా?

తాపసుఁడు—నీరాకచేత నిప్పు డది విశేషము. [వెండియుం సస్నేహముగా] భిక్షువ నీవు పురుగువలె భూపర్యటనముచే బడలినావు. కావున నీమిథిలయందు నైదురేల విశ్రమింపుము. ప్రసంగము వలన నీ యేఁటుం బాడఁబడఁదగు.

భిక్షువు—కోరికచేసి మాకు [illegible] ?

తా—కాదు కాదు. ఈ సేవ్యుఁడు బ్రహ్మవిద్యానోదశీలుఁడు.

భి—[కౌతుకముతో] సత్యము. ఈరాజు బ్రహ్మవిద్వాంసుఁడు.

తా—నిజము. స్వామియయిన దశరథునకు [అని యర్థోక్తి గలుగఁగా,] స్వామియైన శితికంఠుని యాజ్ఞ.

భి—[విమర్శించి] తెలిసెఁ దెలిసె. నీవు రాక్షసుఁడవుగదా? తాపసుఁడవో కావు.

తా—నీ వెవ్వఁడవు? అది చెప్పుము.

భి—నేను నెవఁడో యొకఁడను; నీవంటివాఁడను.

తా—సర్వమంత్రి మకుటమాల్యభూతుఁడైన మాల్యవంతునిచేతఁ దాటకంగుఱించి పంపఁబడిన వాఁడనుగదా నేను. అతనిచేత వినఁబడెఁగదా? ఎట్లన్న; విశ్వామిత్ర ముని తనజన్నమును గాపాడుటకొఱకు నీకొడుకుల రామలక్ష్మణుల నిమ్మని యయోధ్యానాథుఁడైన దశరథరాజును యాచించెను. అపుడ డీముని యవశ్యమ మాననీయుఁ డని యెన్ని తనకన్నులకన్నఁ బ్రీతిపాత్రము లైన యయ్యిరువురు తనయుల నతని కొప్పగించెను.

భి—అటువిమ్మట నటువిమ్మట.

తా—అంతట సంతుష్టుఁ డై యాముని యాభూమీశ్వరునకు దివ్యమైన తాటంకయుగ
 ళము పారితోషిక మొసంగెను. మఱి, ఈ తాటంకద్వంద్వము వెలుఁగొందఁదగినది.
 క. కాన నిది పీరజననివి, పీసుల కుచితం బటంచు విలసిల నౌరా
  మానికములలో వర్ణవి,తానము తానే తెలిపెడుఁ దథ్యముగాఁగన్.
 అందుచేతఁ గౌసల్య కర్ణములయం దుసుపవలసినది యని చెప్పెను. రాచకొమరుల
 నిరువురఁ దోడ్కొని యమ్ముని నిజాశ్రమపదమునకుం జనియెను.
భి—అహో! మణులలోపల వర్ణములు స్ఫురించుననునది యసంభావ్యమఁట! [ఆలోచించి]
 మఱియుం మాల్యవంతునిచే ఎవనివలన నాలకింపఁబడెరెు ?
తా—తే. వార్తకౌతుకకరివిద్య పరమవిమల, మఱిజగన్నుత మృగనాభిమహితగంధ
  మంబువునఁ దైలబిందువునట్టు లణఁగ, కేచు నీమూఁడు దమయంత నీజగమున.
 అందును బలుగుండ్ర వేఁగువాండ్ర నియోగించినవాఁడు మాల్యవంతుఁడు.
భి—పిమ్మటఁ బిమ్మట.
తా—అది విని యాకమ్మదోయి లంకజేరియమ్మచెవులకుఁ దగిన దని యెంచి దానిని
 హరింపఁ బ్రేరింపఁ దాటకంగూర్చి మునుపే యెవఁడో పంపఁబడెను. ఇపు డాతాటక
 చేలివలనఁ దాటంకములఁ దెచ్చుటకుఁ దాటకావనముంగుఱించి నేను బంపఁబడినాను.
భి—అట్లయిన నెట్లు మిథిలోపకంఠవనంబుం బ్రవేశించితివి.
తా—లంకేశ్వరుఁడు మిథిలకు వచ్చె నని నేను వింటిని. మిథిలావృత్తాంతము దెలియఁ
 దగిన దని మాల్యవంతుఁడుం జెప్పెను. అందువలన మొదట మిథిలోపకంఠమునకే
 వచ్చితిని. మఱి నీ వెవ్వఁడ వది చెప్పుము.
భి—తాటకంగుఱించి మాల్యవంతుఁడు మొట్టమొదట నెవనిఁ బంపెనో ! వాఁడే నేను
 గదా ? మిథిలాగమనకారణమో మన కిరువురకు సమానము.
తా—[సహర్షంబుగ] ఇప్పుడు చెప్పు మంలెయు సతాటంక మగు తాటకావనమును
 గూర్చి.
భి—[నవ్వి] చెలికాఁడా ! సతాటక మని యంటవలె కడుగుము.
తా—[సాతంకంబుగ] మఱి యాతాటక యిపు డెక్కడ ?
భి—పురిం బ్రవేశించెను.
తా—అదేమి దశరథునిదా ?
భి—కాదుకాదు, కాలునిది.
తా—తాటకకు దేనిచేత నంతకపురప్రవేశము ?
భి—రామబాణముచేత.
తా—ఓయీ ? ఆరాముఁ డెవఁడు ?

భి—[విమర్శించి] విశ్వామిత్ర పరిచర్యాప్రవణులైన దశరథకుమారు లిద్దఱిలో వాఁడు వీఁడుగదా!

తా—సరే. మఱి, తాటకాకుమారులు మారీచసుబాహు లిపు డెక్కడ?

భి—సుబాహు వామెనే యనుసరించెను. మారీచుఁడు దశక బాలలీలోచితమైన రాము శరాచపాతముచేత దూరముగా నెత్తుకొనిపోఁబడి ప్రాణముతోనే పాఱవేయఁబడెను.

తా—ఐన నిది యేలిచేసెను దశకంధరునికి విన్నవింపఁబడెనా?

భి—సరే. వాలమ్ముగాలిచేఁ గొనిపోఁబడినవాఁడును పోఁతలిడుచున్నవాఁడును నగు మారీచునిచేతనే మిథిల కరుగుకొంచిన లంకేశ్వరుని కిది విన్నవింపఁబడియెను.

తా—పిమ్మట, ప్రకృతికోపమువంటి రాక్షసరాజే మని తలంచెను?

భి—చెలీ! సీతాముఖశీతాంశు శీతలమైన లంకేశ్వరుని మనసునం దేసంతాపమును బొ
మదు.

తా—అందువలన రామలక్ష్మణు లిపుడు విశ్వామిత్రాశ్రమమందనే యున్నారా?

భి—లేదు లేదు. ఆ యిరువురతోడం గూడ విశ్వామిత్రుఁడు మిథిల కరిగెనని నేను వింటిని. [తెరవంకఁజూచి సాశంకముగ] అహహా! మహాప్రమాదము. పలాశ సమూహ దాహక దావదహనుఁడు సానుజుండగు రాముఁ డిచటి కేఁడె సంప్రాప్తించెను? కాన దొలఁగి చనుటయే మనకు శరణము. [అని యిరువురు నిష్క్రమించిరి.]

ఇది శుద్ధ విష్కంభము.

---

అంతట రామలక్ష్మణులు ప్రవేశించుచున్నారు.

రాముఁడు—వత్సా! లక్ష్మణా! ఆరామమునయొక్క రామణీయకముఁ జూడుము.

లక్ష్మణుఁడు—ఆర్యా! స్వభావముచేతనే యీతోఁట రమ్యమైనది. ఇప్పుడన్ననో వసంతలక్ష్మీసమాగమముచేత మఱింత విశేషము.

రా—అబ్బాయీ! ఇది యిట్లే. వసంతలక్ష్మి అవతరింపక యవతరించినది. ఎట్లనఁగా?

తే. లేఁతి పూఁదేనెఁ ద్రావెను తేఁటిదొంట్లు, కాకలీధ్వని యింపయి క్రాలెఁ జాల
దక్షిణానిలనిర్దిష్టతత్పదగతి, నిండు వంజుళమంజరి యొలమినాడు.

మఱియును,

ఉ. చిత్తజరాజశాసనముచే మలయాచలమందునుండి యా
గిత్తమామయికోడు దగుకీర్తితశైలముదాఁక భూతలం
బిత్తఱి గెల్వఁ గోరి సురభీడితబాలసమీరణుండు మున్
జిత్తజవైరి వ్యాళధరుఁ జేరఁగ జంకుచుఁ బోవుఁ దిన్నఁగన్.

ల——నేను మఱియు నిట్లూహించుచున్నాను.

మ. ప్రతిమార్గంబున సల్లతావరతనూవర్గంబు పుష్పౌఘము
త్కృతమాధ్వీకరసంబువర్షముగఁ బర్వింపఁగఁ బూజింపఁగాఁ
జతురాళి ప్రమదానుగీతపరమాసక్తంబు నా ఝెంకణ
క్కృతగం ద్రిమ్మరుఁ దిన్నదిన్నఁగను బూన్కిం బూవడిం గా ద్విలన్.

రా——అబ్బాయీ! ఇంతతోఁ జాలు. ఇపుడు భగవంతుఁడైన విశ్వామిత్రుఁడు పూజనీయుఁడైన యాజ్ఞవల్క్యునిసమాగమసుఖ మెంతదడ వనుభవించుచుండునో, యంతదడ వాయనయొక్క సాయంతనదేవతార్చనమున కుచితములైన కుసుమములను గోయుము.

ల——వల్లే [యని చెట్లనడుమఁ బూలుగోయుంట నభినయించుచున్నాఁడు.]

రా——[పరిక్రమించి.] ఏమి! ఇచట చండికాలయ మొకటి యున్నది! (బద్ధాంజలియై).

క. తల్లీ దయాతరంగిణి, ఫుల్లాంబకసత్సుధోర్మిపురుశీకరిణీ
సల్లలితచంద్రమౌళి, ప్రోల్లసితసతీమతల్లి మ్రొక్కెద నీకున్.

ఆహా! ఇచ దగ్గఱనే, మదకలకలహంసోత్తంసితకమలసముదయకమనీయము సరోవరము నాచిత్తమును స్వాయత్తముగఁ జేసికొనుచున్నది. [సకౌతుకంబుగ] ఔరా! ఎట్టిది పిల్లరాయంచ, వనజవనచరి స్సహచరిస్నాసి, మామిడిచెట్టునడిమియెడ కరుగుచున్నది? [చెవి యొగ్గి] ఆహా! ఇదేది? మదనమహారాజవిహారమదావళముయొక్క పసిఁడిగొలుసుల చప్పుడుచాడ్పున మనోహరమగు కోలాహలము వినఁబడుచున్నది. [నిపుణంబుగ న్నిరూపించి] నిజముగ నిది యందెలరొద ఈరాయంచపిల్ల తిగిచికొనఁబడినందున. ఇందువల్ల నిందు ముందుగ నెవతెయో యొకసుందరి, కాళ్లకదలికచే మ్రోయుచున్న యందియలఁ గలదియగుచుఁ జండికకోవెలకు వచ్చుచున్నదిగా నుండవచ్చును. కాన, నీక నాలోకించుట చాలును. పరస్త్రీశంకయుం, రఘువంశజాలమైన మాసంకోచమునకు, [అని పరాఙ్ముఖుఁ డగుచున్నాఁడు.]

[తెరలో] భర్తృదారికా! ఇక్కడ నిక్కడ.

రా——ఈమె రాజకన్యయా? అందువలనం దిలకించెద. [అంతయుం విలోకించి, సకౌతుకంబుగ].

ఉ. ఏయదియిద్ది తాతిపయి నేర్పడ గీచినపైఁడిగీఁత గాం
గేయపరంటిలోనిజిగిఁ గేరెడు నంగముల న్నిడుఱ్ఱు హరి
ద్రాయుతనీరపూరరుచి దర్పకక్రీడలగీమువాకిటన్
శ్రీయుతమైనదివ్వెవలెఁ జెల్వుగ వెల్గుచున్న దెన్నఁగన్.

[అంతట సీత ప్రవేశించుచున్నది. సఖియును.]

సీ—చెలీ! చూడు మిప్పు డిప్పూఁదోఁట, విల్లెక్కిడికొన్నవాఁడును, ఆమనితోడఁ గూడుకొన్నవాఁడును, నగు మరునిచేతఁ గైసేయఁబడినకైవడిఁ గానఁబడుచున్నది.

స—అనవద్యాంగి! ఇది యిట్టే.

రా—సర్వానవద్యాంగి యని చెప్పఁగఁదగు. ఇప్పుడఁతికి వ్యక్తముగదా!

తే. మోవిబంధూకబంధువు మొగలిరేకు, వన్నెగన్నిప్పువూమొగ్గవలెను బుగ్గ
పలువరుస దాడిమీబీజపరిభవకర, మగుచు మొగ మవ్వఁ దమ్మి కొనఁగును గొలువు.

[చెండియుం జూచి,] ఆహా! ఈమె ముగ్ధయయ్యును, ఆయా కమనీయవస్తువుల విషయమైన పరిశీలనౌచిత్యచాతుర్యమును, అంగములచేతనే యంగీకరించుచున్నది.

చ. అడుగులచేత నంచదరుణాంబుజకాంతి నధఃకరించెడు౯
గడుకొని కేలఁ గైకొనెడుఁ గ్రమకిసాలసుశోణశోభల౯
విడువక విద్రుమద్యుతి నివే పలుకప్పనఁ గ్రోలులీల నో
ష్ఠదళము నవ్వువెన్నెల సుధాంశురుచి న్నగువన్నె మిన్నగన్.

స—రాజపుత్రి! ఇదిగో ముందు చండికగుడి.

సీ—[సాంజలియై] ఓసి దేవేరీ! నెలదాలిసామేనిదానా! ముజ్జగముల ముత్తైదువా! నీకుఁ గేల్మోడ్పు.

స—[నవ్వి] జోతరీతి మిగులఁ దగినదే.

సీ—[బాలయలుకతో] పొల్లు ప్రల్లదములఁ జాలింపుము.

స—[దోయిలించి] ఓదేవి!

క. ఇందుశిరోమణిరమణీ, యిందుశిరోమణి మదీయహితసఖియా నీ
యిందుముఖి యిందుసుందరుఁ, బొందుత మగనిం దొరదొరఁ బురుషోత్తమునిన్.

రా—ఎట్టీమె పెండ్లిగోరునది చెలికత్తె? [ఆలోచించి] ఇది యుచితమే. వయస్సంధియం దీమె యున్నదిగదా? అట్లే.

చ. కడవఁగ బాల్య మీడుగడఁక న్మనమారఁగ రాఁగ మౌగ్ధ్య మె
క్కుడనొ చనంగఁ గౌఁగిలిడుకాంక్ష పొసంగఁగ మిక్కుటంబుగాఁ
దొడరక యున్న నెవ్వఁడును దొయ్యలికైనది మేను మానుగా
నడరెడుఁ గామదేవక మహాకవచంబుగ నిజ్జగంబునన్.

స—ఓదేవీ! నాకోరికను వేగిరముగానే నెఱవేర్పుము ఈమె నెంబెలిం జెందకముందే.

సీ—ఏమని నెంబెలిం జెందెద?

లక్ష్మణుఁడు—ఓరాజహంసకన్యకా! ఏల నెంజెలిం జెందుచున్నావు? ఇదుగో నీ మగండు మామిడిచెట్టునడుమ మఱఁగియున్నాఁడు.

స—[సహర్షంబుగఁ దనలో] ఓమనసా సంతోషింపుము. ఇది సుఖోపశ్రుతిగదా?

సీ—[సకౌతుకంబుగ] ఎవని దిది యేనికగున్న గొంతుగవళివలెఁ దిన్నని తీయని బలుపుఁ బలుకు వినఁబడుచున్నది? కావున రావే కాంతము. [అని యిరువురు పరిక్రమించుచున్నారు.]

రా—[సవిషాదంబుగ] అయ్యో! ఎట్టి తాఁగి లతవెత మఱుఁగుపడెను! [illegible]

క. స్తనవిజితస్తబకశ్రీ, వినుతాధరవిర్జితకిసవిలసితలక్ష్మీ
వనిత న్మఱుఁగిడియెదె నా, నను గనకున్నావు నీవు నలువేవల్లీ.

[మఱియు, సహర్షంబుగ]

క. నలుపైన యరఁటియాకుల, నడుమఁ గనంబడెడునంగనామణి జలదం
బులనడుమఁ గానఁబడుశశి, కలవలెఁ దనిపెడుఁ జకోరకమునువలె ననున్.

రా—[అరఁటిచెట్టుంగూర్చి.]

ఆ. బాలహేమరంభ పడఁతుకతోడసిరిఁ, బడయఁ గడఁగు మీ వడాడల కదర
నీవిలాసవతినిఁ బోపనీ కాపుమీ, స్త్రీలకల లెనసిన స్థిరతను గనా.

సీ—[సకౌతుకంబుగ] చెలీ! వీఁ డెవఁడు, కరుసపుసెమిలిపించెపుఁ గనులచేఁ గైసేయఁబడిన చెవులుగలవాఁడు, పసిఁడివన్నెవాఁడు, ముగుదతనముచే విడువఁబడినచూడ్కి-వేడబములు గలవాఁడు, కొమరుఁడు, చూడఁబడుచున్నాఁడు? వీనియెడ నామది పేర్మిచేఁ దోడుగఁబడుచున్నది.

ల—ఔరా! ఈమె యేమె? నిర్వికారమధురమూర్తి, తద్దయు దయగలదిగ దర్శింపఁ బడుచున్నది. ఈమెయందుం దల్లియందువలె నాచిత్తవృత్తి వర్తిల్లుచున్నదిగద?

సీ—[సకౌతుకంబుగ] చెలీ! ఈకొమరునిఁ గనుచున్న నాకు బిడ్డయైన యూర్మిళ మదిం దోఁచుచున్నది.

స—[నవ్వి] యుక్తము. ఇతఁడును, ఎవనికో యొకని కట్టివానికి బిడ్డఁ డను శబ్దముచే- బేర్కొనం బడఁదగినవాఁడు కాఁగలండు. ఎవనిఁ జూచుచున్న నాకు నీవును మనస్సున స్ఫురించుచున్నావో?

సీ—ఓసీ? నవ్వులమారీ! ఈమాట చాలు. ఇతఁ డెతఁ డని యడుగు.

స—[పరిక్రమించి] ఓయీ! ఎవ్వఁడవు నీవు? చిన్నప్రాయమువాఁడ వయ్యు, నఱుఁగని వనవీథులయందు దొంటరిగానె విచ్చలవిడి విహారించుచున్నాఁడవు?

ల—ఛీ మూర్ఖురాలా ! సమీపమున వర్తిల్లుచున్న యన్నయైన రామచంద్రునితోఁ గూడియుండుటచే నాథవంతుఁడ నైన నన్నొంటరి యని యెట్లు చెప్పుచున్నావు ?

స—ఇపుడు నామనోరథశాఖి పుష్పితము.

సీ—మనము ముందువలె నిపు డెట్లు తిరుగుచున్నారము ? [అని పరిక్రమించి, యపక్రమించి.] సఖియా ! ఒకటి మఱచితి. దేనికి బండిగురివెందతీఁగతోడికూడిక నమ్మగారు గోరుచున్నారో, అట్టి యీతియ్యమామిడిచెట్టు చూడఁదగినదిగదా ?

రా—[సకౌతుకంబుగ మనస్సున,] ఆహా ! లజ్జాకుతూహల హేలాలాలితంబులు, వయస్సంధిమధురంబులు, వనితాజన లలితంబు లివి యెట్టివి ? (మాటలు.) [ప్రకాశంబుగ,] అందాఁక రమ్ము. చూతము. [అని యిరువు రరిగిరి.]

రా—[చూచి, సహర్షంబుగ,]

క. ఇదె నామది యనుకలువకు, ముదంబు నిడు శారదమగుపున్నమ రేయై
పొదలెడు వెండియు నీయెడ, నిదియె జగన్మోహిని యన నెసఁగెడు నాహా.

[చూచి,] అట్లుగదా ?

ఉ. ఒందుత దీనిచూడ్కి యసితోత్పలమాలికమాడ్కి వేడ్కమైఁ
బొందుతఁ బూర్ణచంద్రరుచిఁ బొల్పగుదీనిదిసొమ్మొగ మ్మిఁగం
బొందుగ దీనిచన్నుగవ పోరెడుఁ దామరమొగ్గలందమున్
బెం దమమున్ సృజించెదును వింతగ దీనిదిగొప్పకౌ ప్పొగిన్.

[విమర్శించి,] రసాలాలోకనకుతూహలమువలన నీచెలువ యెట్టిక్కడనే మెలంగుచున్నది ? అందువలన నందనుకం దొలఁగియుందును. [తొలంగి తీఁగపొదయం దణఁగుచున్నాఁడు.]

సీ—[సరభసంబుగఁ జనుదెంచి] చెలీ ! ఇదిగో తియ్యమావిచెట్టు. [సలీలంబుగ, రసాలలతను పరామర్శించుచు] సఖియా ? మొలకగోరులకొనలచే వ్రాయఁబడిన మెత్తని రూతులచే నెన్నుచున్నాను ఇది యెవఁడో యొకనేర్పరిచేతఁ గావింపఁబడిన దని. ఇటు గాదేని, తనమది కదలికఁ దలఁచిన తుంటవింటిదంటచేతనే.

రా—ఓసీ లతాంగి ! మఱి నే ని ట్లూహించుచున్నాను.

ఉ. పూవిలుకాఁడు నీతనువెపో తనవి ల్లని మధ్యదేశమున్
దాఁ బిడికింటఁ బట్టె భువనత్రితయైకవశీకరోరుము
ద్రావిఖవత్రిరేఖ లన రాజిలువ్రేళులసందుగీరలం
దో వరపక్ష్మసీమణి యొవాఁ త్రివళీకపటంబుడంబునన్.

స—[చేరఁబోయి] ఇదిగో యీ వాసంతిక. [సకౌతుకంబుగ,] రాజపుత్త్రికా! ఈకడ నాలోకింపు.

క. ఇందు న్వాసంతీరస, బిందువు నిందిందిరములు పేర్మిం ద్రావున్
ముందెవి మందిర మయ్యెర,విందము నలిమందము గని వే విడనాడున్.

సీ—ఇది యిట్లే [ఇందుస్వాసంతీత్యాదిపద్యముం జదువుచున్నది.]

స—అహో! తీఁగయొక్క చక్కఁదనము!

రా—ఆ! ఇది యేమి? వెండియుం దీవ వర్ణింపఁబడుచున్నది. ఇది యుక్తమే.

క. వదలఁగ శైశవశిశిరము, పొదలఁగ యౌవనవసంతమును గుచగుచ్ఛా
భ్యుదయ మొదవుటను నవయువ, తిదితనులత మదమునిడు మదినిఁ గడు మాకున్.

స—[నవ్వి,] చూడుము. ఇదె వాసంతీలత తానే బాలరసాలము నాలింగనము సేసికొన ముందుగ నరుగుచున్నది.

సీ—[బాలయలుకతో] ఇప్పుడు తప్పనుడువులఁ జెప్ప నీయొక్కప్రక్క నెడలి వేఱొక్క చక్కి కరిగెద.

రా—[నిర్వర్ణించి]

తే. విమలబిసరోచులు కపోలవిభ్రమములు, చంచలసలీలనీలాంబుజములు గనులు
చారువికసదశోకకిసములు శయము. లలితవవిలాసములు మనోహరము లవును.

సీ—[సకౌతుకంబుగ, తనలో]

చ. విరిసినమల్లెగల్వలకు బేర్చినదండ యనంగ నల్లనై
మరుపగవానియోదలను మానగు క్రొన్నెలవోలె లేఁతయై
పరఁగెడుపీఁ డెవండు సిరిపాపని మీఁటెడుఁ గుంచెసొమ్మువాఁ
డిరవుగఁ దీఁగయింట నిడు నెంతయు వేడ్కను నాదుచూడ్కికిన్.

స—భర్తృదారికా! తీవెఁ జూచు కుతూహలము నేల మానినావు?

సీ—[విననట్లభినయించుచున్నది.]

స—ఎట్లీమె యన్యాసక్తచిత్త యయ్యెను? మఱి యీమెచిత్త మెట్లో? [రామునిఁ జూచి, సాకూతంబుగ,] ఆ! ఇది యీమె చిత్త మను గజమునకుఁ గట్టుకంబము. [నిర్వర్ణించి] ఇది యుచితమే. అట్ల కదా?

క. ఈముగ్ధాకృతిచేతన్, శ్రీమహితునిచేఁ గుమారవృషభునిచే నా
రామం బీయది సలతము, సోమార్తిఁ గపర్దమువలె సొబగొందుఁ గడున్.

స—[సీతను జేతఁబట్టుకొని] ఏమమ్మా! నీచెలికత్తె నేల విడనాడెదు? అటు గాదే నిది యుచితము.

క. నామాట వినుటవలనన్, శ్యామ లతావలయమునకు నరుదెంచుట చే
నీమనమున నీమనసిజుఁ, డేమే తెలకొన్న వాఁడె యెఱిఁగింపవుగా.

సీ—[తనలో] దీనిచే నే నె ట్లెఱుఁగబడితిని? [అని సిగ్గుతో మొగము వంచుకొని నిలుచున్నది.]

రా—క. కనవే కురంగనయనన, యనములఁ గమలస్మయాపహరములను గనుం
గొన నగుఁ గళిందనందని, ఘనతుంగతరంగశోభ ఖతలం బెల్లన్.

స—[తనలో] ఈమె యేల సిగ్గుపడుచున్నది? అందు వలన వేఱుచోటికిఁ జేర్చెద. [ప్రకాశంబుగ] నీహృదయ మేల యిప్పుడును నీ ప్రణయకోపమును వదలకున్నది?

సీ—[తనలో] ఏల యిది యలంకరింగుఱించి పలికెను? మఱి యిది కాదు. [వెల్లడిగా] చెలీ! నీయెడ నే నేల కనలుదు? నే నెందో డెంద ముంచితిని, అందుచేత నట్లు తలంచితిని.

స—ఇప్పుడు మఱి యెక్కడ దత్తచిత్త వవుచున్నావు?

సీ—ఆరామ సీమనే.

స—ఆహా! ఈమె జాణగా నగుచున్నది. ఆకారప్రకటనముచేతనే వ్యక్తముగా నాకార గోపనమును జేసినది.

సీ—[లజ్జ నభినయించుచున్నది.]

స—నమ్మిక కిమ్మయిన నావంటిదానియందును, మనస్సు దాఁపకుము. నే నెఱిఁగినదే.

క. నీమన మున్నది దెలిసితి, రాముని యెడ శ్యామ తామరసదామశ్రీ
కోమలు నెడఁ గమలాక్షుం, డౌమహితుని యెడ శిఖండకాంచితుని యెడన్.

సీ—సకియా! చూడు.

క. వలఱేనిచానదగునం, దెలరవళి యనంగ నేమొ నెఱిఁబలుక్కుచు నీ
రొలమావి మొగుడ తేనియ, నెలమిం గ్రోవియును దేఁటి యిటఁ ద్రిమ్మరెడున్.

[తనలో]

క. కనులార గ్రావుఁడీచెలు, వుని నెమ్మొగము నెడిక మ్మిపువుదేనె న్నీ
రసువొంద నందుఁ దిరుగుఁడు, గనఁబడియెడి నెం దితండు గడుఁగడు మఱియున్.

[అని, సలీలంబుగ రాము నాలోకించుచున్నది.]

రా—[నిర్వర్ణించి]

మ. అగుసర్వస్వము యౌవనంబునకు గీమా సర్వభోగాశిక్ష
దృగుపాత్తం బగుభాగ్యము న్మదజయశ్రీ కన్నసౌభాగ్య మా

జగదేకం బగుసారసాక్షి జనికి మెచ్చంగన్ ఫలం బంగజా
ధ్వగశృంగారరహస్య మీరమణి యాబాగించు కేఁ గాంచితిన్.

సీ—[తనలో, రెండియుం నాగాథనే చదువుచున్నది.]

స—భర్తృదారికా !

క. ఇది యొకబాలభ్రమరము, గదురఁగ మది నల్లగల్వగమిని మెలంగన్
గదిసి కదుఁ గడఁకఁ బొదలిన, ముదమున నీకనులయెదుర మురియుచుఁ దిరుగున్.

సీ—[స్వగతంబుగ] ఓ కనులారా ! ఈమేలు వినికిచే నొగడుఁడు. [అని మఱియును రాము నాలోకించుచున్నది.]

రా—[సోత్కంఠంబుగ]

తే. బాల యమృతపయోధికల్లోలలోల, లోకనముల మునింగించు నీకడ నను
గాదె యిది సుముహూర్తంబు గాకయున్న, బ్రహ్మనిర్మాణము లవెట్లు బాగుమీఱు.

చేటి—రాచకూఁతురా ! రాణిగారిచే నాజ్ఞాపింపఁబడినదానను. ఏ మని యనఁగా, బిడ్డ యగు సీతను దోడ్కొనివచ్చి యచ్చెరువుఁ గలిగించు మంచి నగలచే సింగారింపవలె నని, అందువలన నాసీతమొగముదామరం గనుంగొని కన్నులు చల్లగాఁ గలవారము గాఁగల మని.

సీ—ఎట్లు కూరిమివలన ముద్దరాండ్రు నాయమ్మగారు ?

చే—మిగుల ముగుద లని యనఁదగును.

సీ—మఱి యెట్లు నాయమ్మగారు ముగుదలు ?

చే—సబామచేఁ జక్కందనము గలిగి చూడ్కులకు జాబిలిరేకమాడ్కిం బాపట్టునట్టి నిన్ను, నైసేతచేతఁ నైసేయఁ గోరుచున్నందున వారు మఱి మిగుల ముగుదలు గారా ?

ఆ. చెలియ నీదుమొగము చెలఁగుఁ జందురుఁడుగఁ, బండువెన్నెల నిడుఁ బండ్లడాలు
నల్లగలువదండ నాటి నీయదిజడ, పాలపోఁతమాడ్కిఁ బరఁగుఁ జూడ్కి.

ఇందుచేఁ జాలు. అందువలనఁ బోదము. [అని ముగు రరిగిరి]

రా—[సవిషాదంబుగ, తనమనమున] అయ్యో! ఇయ్యబ్జాస్య చూపుమేర మీఱి పోయెను. [రెండియు సప్రత్యాశంబుగ]

తే. అగపడకయుం నాకనులకు నగపడియెడి, నెంతయును వింత యింతి మేల్బంతియిద్ది
పగలురా రేయిపోయినఁ బలుదమిఁ గను, సచ్చకోరకములకును జంద్రికవలె.

ల—ఆర్యా ! ఇది యగపడుచున్నది.

రా—అది యెట్లు తిరిగి వచ్చెను? [చూచి] కాదుకాదు. [బిగ్గఱగా,] అబ్బాయీ ! ఏది యగపడుచున్నది ?

ల.—శా. లీలానిర్జితచిత్తసంభవధనుర్లేఖుండునై చూడఁగా
బాలుండైనసుధామయూఖునికి నొప్పం గాంతి నిండించుచున్
జాలన్ రాగముచేత మించుచు నుదంచత్తారకావాప్తిరా
త్రాలు న్సంధ్య స్వయంవరాంగనవలెం గావించుచున్ మోదమున్.

రా.—(స్వ.) సుఖోపశ్రుతిచేత నింతకు నేమో యూఱడింపఁబడుచున్నాఁడను. (ప్ర.)
అబ్బాయీ! ఇది యెట్టే. ఇప్పుడు గదా?

మ. పొనరం జేసి కడుం బ్రబుద్ధకమలంబు ల్గాఁ ద్రిలోకంబులన్
దనరం జొచ్చుఁ బయోధిగర్భమును మార్తండుం డితం డిప్పు డ
ప్పనిధ్యాశ్రయునాభిపంకజము నొప్ప న్విప్పఁజేయంగఁ దా
ఘనకౌతూహలుఁ డౌటనో యన హరిఖ్యాతుండు పద్మాప్తుఁడున్.

[మఱియుం సకౌతుకంబుగ] అబ్బాయీ! వీని నిక్కడఁ జూడుము. ఇంచుక మెఱయుం
చీఁకటిగుత్తు లనెడు కస్తురిమకరికలగములఁ గలిగిన రాత్రిమత్తకాశినిఫాలస్థలమునందలి
గందపుబొట్టువలె రేఱేఁడు వెలుఁగొందుచున్నాఁడు.

[విలోకించి, నిర్వర్ణించి]

శా. చాలం జక్కవదోయి కీయది మనశ్శల్యంబు జ్యోత్స్నాప్రియా
పాళిత్రోటికి వాటయుగ్మమును దర్పం గుంచెకో ల్గాంచఁగన్
శూలిప్లుష్టమనోజభూజముబడిం జూపట్టు క్రొమ్మొల్కకా
మ్యాలీఢస్మయసామజాంకుశము నుద్యచ్చంద్రమోరేఖయా.

[విలోకించి నిర్వర్ణించి సహర్షంబుగ.]

మ. అలలం బోయినపంకముం గలదిగం గాంచ న్మృణాళంబు నొ
ప్పలరుం గ్రప్పుదబ్బి పుష్పశరభార్యాశీధుభృంగారనా
ళరుచిస్ఫీతము వార్ధివెన్న ఖసరోలక్ష్మ్యబ్జపత్రాంబుబిం
దులసద్ధర్మము చంద్రఖండ మిది సంతోషంబు నీ దేరికిన్.

[చుట్టుపట్టుఁ జూచి సహర్షంబుగ,] అహాహా! ఇప్పుడు.

రత్నావళి.

పొందఁగఁ దూరుపుబంధకిబంధువు - పొదలినఘనతిమిరప్రకరం
బందఁగఁ బడమరసైవ్వరిణివైరిసు - ధాంశునికరనికరంబు పొరిం
బొందు గనీలార్ధస్ఫటికమువలెఁ - బొనరుచు దిఙ్మధ్య మిటం గా
ళిందీగంగామిళదమలాంభో - లీలానవ్యాంచితమైత్రిన్.

అందుచేతం ద్వరితముగానే దేవతార్చనముకొఱకుఁ గోసినపూవులతోఁ బూజనీయుఁ
డైన విశ్వామిత్రుని నుపాసింతము. [అని రామలక్ష్మణు లిరువురు నిష్క్రమించిరి.]

ఇది ద్వితీయాంకము.

# ఆంధ్ర ప్రసన్నరాఘవ నాటకము

## తృతీయాంకము

---

[అంతట వామనకుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

వామనకుఁడు—[తన్నుఁ జూచుకొని,] ఆహా! నామేనివెంపు. కానీ! సొగసుగా నిగిడింపఁబడిన కేలు దలలతోడఁ బోవు నాకు వాకిలితలుపు సిగరములు దాఁకకున్నే? అందువలనం గుజ్జుగా నయి పోదును. [అని యట్లొనర్చుచున్నాఁడు.]

కుబ్జకుఁడు—[ప్రవేశించి, విహసించి,] ఓయి వామనకా! ఇపుడు నీవు, అన్నిగొనముల చేత నిండుకొన్నావు. ఎందువల్ల ననఁగా, మొదట వామనకుఁడవు. ఇపుడు మఱి గుజ్జుతనముం బొందినవాఁడవు.

వా—[సక్రోధంబుగ] ఓరి మోఱకా! నీ గుజ్జుతనము నొరునియెడ నెట్టు వెట్టుచున్నావు? నీవే గుజ్జువురా. తలుపు దారబంధములు దాఁకు నను జంకుచే నాచే నాయందు గుజ్జుతనము గలిగించుకొనఁబడినది.

కు—ఓరీ బుద్ధిలేనివాఁడా! జేనెడంత నీ మేనిచేఁ దలుపు దారబందము లెట్లు తాఁకును? మఱి నేను గుజ్జని నీకు నెవఁడు నెప్పెను.

వా—ఓయీ! నీ వెన్నునందలి యీబొలముద్దయే.

కు—ఓరీ బుద్ధిమాలినవాఁడా! ఇద్ది యెట్లు బొలముద్దరా! మఱి సొబగు సిరికిఁ బలగడిందురా!

వా—ఓరీ! మెల్లమెల్లఁగాఁ జెప్పు. మనవంటి యంతిపురి కొలువుడుగాండ్రకు సొబగన్నమాట విన్న నొడయఁడు కసలఁగలఁడు.

కు—వెఱవ నేల? ఱేఁ డిపుడు సమాదియింట నున్నాఁడు.

వా—లేఁడు లేఁడు. ఇపు డెవఁడో యొక పెన్నిరాబారిరాక వార్చుచు మోసల నున్నాఁడు.

కు—ఇపు డెవఁడు పెను నిరాబారి? వేగుగా నుండును.

వా—సరే.

కు—అందువలన మనము చెడితిమి. మొదటనే మనము యాజ్ఞవల్క్యుఁ డను పేరుగల

యెవఁడో యొక పెనురాబారిచేఁ గఱపఁబడినవాఁ డగుచుఁ గన్నుల మూయుట చేతను జాఱుటచేతను రేలుంబవళ్లు గడుపుచున్నాఁడు. ఇప్పు డితనిచేతఁ గిఱరింపఁ బడినవాఁ డవుచు నంతిపురమునే విడువఁగలఁడు. పిదప దిసమొల తపసి నూలుగుడ్డలచేఁబోలె నితఁడు మనచే నేమి సేయఁగలఁడు ?

వా—వే ఉండుము. వీఁడు మన రాచతపసికి విద్దె గఱప వచ్చువాఁడు గాఁడు. మఱి ముక్కంటివింటిఁగంటకు.

శు—[విహసించి] వేలిమిపొవచే నల్లనైన కన్నులు గలవారికి ముక్కంటివింటిఁగంటకు వేడ్క యెటువంటిది ? అందువలన వీఁడు రాచపాఱుఁ డని యెన్నుచున్నాను.

వా—ఎట్లు నీయొడలివలెనే నీమదియును వంకర యయ్యె ? వీఁడు నిక్కముగ రాచవాఁడై యని యెఱుఁగఁబడుచున్నాఁడు.

శు—కావునఁ దడవుగఁ దపసితనమున విసికినవాఁడై వీఁడు సూటియైన మదిగల మన రాచతపసియొక్క దొరతనమును గైకొనుటకు వచ్చుచున్నాఁ డని వీని నే నెంచుచున్నాను. అణఁగుత దోసము. ఎ. ఇటువంటిది పలుకకు. ఎ. ఇతఁడు తడవుగ నలరింపఁబడిన బమ్మయొక్క పలుకుచేత రాచతనముఁ బాపికొని పాఱుతనముఁ బడసినవాఁడు.

శు—ఎట్లు నీమేనివలె నీమదియుఁ బొట్టిదయ్యె ? ఎవఁడో యొకనియొక్క మాటచేత బాఁపఁడు గానివాఁడు బాఁపఁ డౌనేని, నామాటచే నీవును బాఁపఁడ వవుము.

వా—ఓరి పొలసుఁడా ! భగవానుఁ డగు నలువకును గొడ్డుమాఱిగల నీకును వేఱిమి యెట్లు లేదు ?

శు—నిక్కముగా వీఁడు బాఁపఁడే యైన నీవింటిఁగంటకై యేల వూనెను ?

వా—కలదు. ఇతనిప్రక్కల నిక్కడనే యలవఱిచికొన్నవిద్దెలఁగల యిద్దఱు రాచకొమరు లున్నారు. అందువలన వీరికిం గనఁబఱుపఁగలవాఁడ నిచ్చుచ్చుకంటివింటి నని వచ్చుచున్నాఁడు.

శు—అందువలన నెట్లు వీఁ డచ్చమైన తలఁపుఁగలవాఁడు.

వా—సరే.

శు—అందువలన నంతయుం జెప్పుము. వీనియందుం దబ్బఱదోసము మోపుటచే నాకు దోసఁగు గలిగినదా లేదా ?

వా—పెద్ద దోసము గలిగినది.

శు—దమ్మమువిత్తువ మొఱఁగవురా. తగులము గలవారియెడఁ బరియాచకపుఁ బలుకులు [illegible]ఁ గతములు గావుగా.

వా—[విహసించి,] ఎట్టితఁడు నీకుఁ జుట్టఱికము గలవాఁడు ?

శ—వీనికి నిరువురు కొమరులు. మనకును నిరువురు కొమిరెలు. కాఁబట్టి చుట్టఱికము గలుగఁగల దని తలఁచుచున్నాను.

వా—ఎట్లు మన కిట్టి పుణ్యము ? [నేపథ్యమందు,]

మ. శరసంతాడితతాటకుండు విలసత్సద్రత్నతాటంకుఁడుఁ
శరదంభోజపలాశాయతాక్షుఁడును నైజానొందు శ్రీరాముతోఁ
వరలీలాత్తశిఖండమండితుఁడునై భాసిల్లుసౌమిత్రితోఁ
బరమామోదుఁడు వచ్చు నిచ్చటికి విశ్వామిత్రుఁ డీతం డహా.

[సహర్ష విస్మయంబుగ] ఎల్లజగములకు వెఱపుఁ గొలుపునది యెదియో యది తాటక యను రక్కసి యని వినఁబడుచున్నదిగద ? అద్ది యీతనిచేత బిద్దింపఁబడియెను. కావున నితనికి ముక్కంటివింటి నెక్కిడుట యెన్నఁదగియున్నది. అందువలన రమ్మి. వీనులవిం దగు వేలుపుబువ్వను దేవేరులకు విన్నవింతము.

[అని నిష్క్రమించిరి.]

ఇది ప్రవేశకము.

[అంతట రామలక్ష్మణులచే ననుగమింపఁబడినవాఁ డగుచు విశ్వామిత్రుఁడు,] వత్స రామభద్ర ! ఎ.

భాస్కరవిలసిత వృత్తము.

జక్కవపులుఁగుల కూఱట గల్గన్ జానుగ నొగి నవి కవగ సుఖింపన్
జుక్కలగములను నొక్కట మెక్కన్ జుక్కలదొరఁ బరిహాసనము సేయన్
దిక్కరిగమనలు గుంకుమపూఁతన్ దేజరిలఁగఁ గలువలు బెగడొందన్
బక్కన నగఁగను బాగుగఁ దమ్ముల్ భాస్కరుఁ డిదె యుదయించెను గనుమా.

రా—[కేల్మోడ్చి]

మాలిని. వనజవనచయంబుం బాగుగా నేలువానిన్
స్వనదుపగతశోకవ్రాతముం బ్రోచువానిన్
ఘనతిమిర మఱన్ లోకత్రయిం గాచువానిన్
దినకరుని నుతింతుం దేవు వేఁగాళ్లవానిన్.

వి—[స్వగతంబుగ=తనలో] నాచేఁ గొని తేఁబడిన యీబిడ్డని రామభద్రునిం జనకరాజు తన తనూజచే సమ్మానింపఁగలఁడా ?

ల—ఆర్యా ! చూడు. ఎ.

శా. ఎందాఁకం ద్యుమణిం బ్రభాతసమయం బింపొందఁ బై కెత్తి పె
న్సంద్రంబందుననుండి నింగియను బాజాఱందు నుంచుం జగ

బందాటకం గొనసాను మాల్యమిడి యంచట్టాకరం బెంచియో
యుందుక్ ఫుల్లసరోజహస్తముల శ్రీ సొంతే నిడు న్మందఱన్.

వి—[సహర్షంబుగం దనలో] విద్వద్వరుడైన లక్ష్మణుని చేతనే యొట్లుత్తరము దత్త మయ్యె!
ముగ్ధవచనములు దేవతాధిష్ఠితములు గదా?

రా—భగవంతుఁడా! బహుమహుజశూరవారణతురంగమతరంగితయయ్యు నీరాజధాని
తపోవనధాత్రివలెఁ బ్రశాంతపావనిగ న్లు భావింపఁబడుచున్నది?

వి—దీనిని జనకుఁడు పాలించుచున్నాఁడు. అతనికి భగవంతుఁడు యాజ్ఞవల్క్యుఁడు
పరమాత్మోపనిషదుపదేష్ట.

రా—ఎవఁడు యోగీశ్వరుఁ డని కొనియాడఁబడుచున్నాఁడు?

వి—వత్సా! అతఁడే యితఁడు.

క. పొంది దినేశు ప్రసాదముఁ, బొందుగ యోగీశ్వరుఁ డనుభూరిప్రథకున్
మందిర మయ్యె నెవం డ, య్యిందిర కరకందమువలె నెంచఁదగుఁ గదా.

[నేపథ్యమందు,]

చ. చెలువుగఁ గుంకుమాంబువులచేఁ దడుపంబడుఁగాత భృంగసం
కలితకుమాళిచే నెనయుఁగాతఁ గడుం బొలు పంతకంతకున్
సలలిత మౌక్తి ముత్తెములచప్పరము ల్వెలయంగ నల్వగం
బురవనితాళిచే నిపుడు ప్రోలివి వెంజెరువు ల్పొరిం బొరిన్.

వి—తగునిది, నారాకవలన సానందుఁడైన శతానందునియొక్క వాక్పరిస్పందము.
[విలోకించి] ఆహా! వీనియొక్క సంభ్రమాతిశయము, నగరాలంకారము కావింపఁ
బడినను, వెండియు నాజ్ఞాపించుచున్నాఁడు.

శతానందుఁడు—[ప్రవేశించి] భగవంతుఁడా! అభివదనము సేయుచున్నాఁడను.

వి—వత్సా! అపరిమిత తపఃప్రభావుఁడ వవుము.

శ—ఓ భగవంతుఁడా! ఈ జనకరాజును భగవదాగమనమును బ్రతిపాలించుచున్నాఁడు.

వి—ఇదిగో వచ్చుచున్నాను [అని పరిక్రమించుచున్నాఁడు.]

వి—[విలోకించి] ఈతఁడు రాజర్షి జనకుఁడు

క. అంగుగ నా తేజోనిమిది, యంగంబుల నెపనియందు నంగీకృతమై
రంగుగఁ ద్రయిరాజ్యశ్రీ, యుం గడుకొని యోగవిద్యయును రాజిల్లున్.

[అంతట జనకుఁడు శిరమునుండి లేచి ప్రవేశించుచున్నాఁడు.]

జనకుఁడు—[విలోకించి] ఆహా!

తే. ఎవఁడు తప మనునగ్నిలో నెసక మెసఁగఁ, దాను దనమేను బంగారుగాని యొనిచె
కనియె నొగిని వర్ణోత్కర్షమును ఘనముగ, నతఁ డితఁడు గాధినందనుం డధికశక్తి.
[ముందఱ వచ్చి] భగవంతుఁడా! ఇది సకలసంపల్లతాప్రరోహాసూలసారామము ప్రణామము.

వి—క్షమాశునాసీర సీరధ్వజా! అప్రతిహతమనోరథుఁడవు కమ్ము. [అందఱు యథోచితముగాఁ గూర్చున్నారు]

జ—భగవంతుఁడా! శునాసీరపదము చేత దూరముగాఁ గీర్తింపఁబడెలి.

వి—ఎటువలె? హరిచందనవనకరుని శునాసీరునిఁ గూడఁ గ్రిందుపఱిచి వర్తిల్లుచున్నాఁడవు.

జ—క. ఎటువంటిది యగు నాకం, బటుసుఖహేతువు త్వదీయపదయుగనమనం
బటువంటిది గా దనిమిష,పుటమది నందనవనజము కుశికతనూజా.

వి—ఆహా! నీయొక్క హర్షోత్కర్షము! అందు చేత సహజసంతోషసముద్రమగ్నుఁడవయ్యు నస్మత్సమాగమసంభవమువలనఁ గలిగిన సుఖశీకరములను బహూకరించుచున్నావు.

జ—భగవంతుఁడా! రాజ్యరాహుగ్రస్తచేతశ్చంద్రము లగు మాకు సహజానందచంద్రికోద్భేద మెక్కడిది?

వి—ఇట్లు కాదు.

శా. తాఁకక్ జ్యానినదంబు దిగ్దళకముక్ దారంబు కంఠంబునీ
లోకంబందు వెలుంగుఁ దేజము గడుక్ లోజ్యోతియాత్మీయమే
మీకు న్వాకొను సింహపీఠినృపతక్ మీశాంతిఁ బద్మాసనం
బోకళ్యాణులు రాజు లీరు నిమివంశోత్పన్నులే యౌదురా.

శ—ఇట్లే యిది.

తే. సక్తిలేకయుం సద్రాజ్యసరసునందుఁ, జారువారాంగనోద్ధూతచామరోర్మి
వెలిగొడుగుఁ దమ్మిరాజహంసులు రహింతు, యోగిరాజపథంబున నున్నవారు.

ల—[అపవారించి] ఆర్యా! ఈరాజులు బ్రహ్మవిద్యావినోదు లని నాకుం గౌతుకము.

రా—ఏమిందుఁ గౌతుకము?

ఉత్సాహ. గొడుగునీడ దేనిఁ జాటు గొలుపఁ జాల దంట దె
న్నఁడును మత్తగజమదమషి నాఁబడెడికళంకముక్
గడిమినార్పనోపకుండు గాలిచామరములద
క్కడిఁడియేఁదొ జ్యోతి దానిఁ గాంతురాత్మ నీనృపుల్.

వి—శతానందుఁడా! రాజహంసు లని సత్యముఁ జెప్పితివి. ఈ రాజహంసులు కువలయోత్తంసులే కదా.

జ—ఇది మా పూర్వులయం దొప్పుచున్నది. కొన్ని యూళ్ల కేలికలైన సీరధ్వజునియం దొప్పదు.

వి—ఆ! ఏమి చెప్పఁబడిరో?

తే. అవనిపాలుఁడు వెలయింతు రవనిఁ బలువు, రవనిపతియశమునఁ నీకె యన్యుని కెటు
లవునవనిదవకూఁతు నీ యనుఁగుఁగూఁతుఁ, జేసెఁ గాకావునను నీవె చెలఁగెదధిప.

జ—భగవంతుఁడా! అభినవభువననిర్మాణనిపుణుండ వగు నీకు నస్మన్నవభాషణ భంగనిర్మాణ నిపుణత యిది యెంతటిది? నీ వతఁడవుగదా! ఎతనికి,

మ. తనచూడ్కిం బొనరించి కోపగుణరక్తచ్ఛాయముం బెన్నలా
కను నాకంబు నభిత్తిప్రాయ మును వేడ్కం దేవతాచిత్రమో
యనఁగా నాయె సుధాకరారుణుల గేయంబైనబింబంబుల
ప్లుష్టోగిం గాంచ సుధాసులాక్షలద్రవంబుల్గల్గు పెన్నిష్పతే.

శ—ఇట్లే యిది. అతఁడుగదా యీ భగవంతుఁడు.

చ. ఎవనిది నూతనత్రిదివసృష్టిసముద్యమసంభ్రమం బహో
యవనిఁ బడం ద్రిశంకువును నాకమునందుననుండి త్రోయ నా
కవిభుఁడు నాఁడు బాదమును గాంచె వికాసముఁ జాల దేవతా
ప్రవరులు గేలుమోడ్పు లిడ భక్తిఁ గనెన్ ముకుళత్వ మెంతయున్.

ల—[అపవారించి] ఇట్టి దితనిది సంతాపితత్రిభువనంబు తపోఽభిధానంబు తేజంబు.

రా—అబ్బాయీ! నీకు దెలియదు.

చ. కనలిన వేల్పుటేనిపదఘాతముచేత నధోగతుం ద్రిశం
కునిఁ గని దృష్టి యీతనిది కోపవిపాటలకాంతి నెంతయున్
గని ముకుళీకృతోరుకరకంజవిరాజిత వాసు సంజచా
డ్పున నమరాళ్యుపాసితగఁ బొల్చె మహాత్ముల క్రోధ మల్పమే.

వి—[స్వగతముగ] ఇంతతోఁ జాలు. ప్రస్తుతవిషయము విచారింతము. [ప్రకాశముగ] రాజర్షీ! వసుధాసంభవంబగు కన్యారత్నంబు నిన్ను నలంకరించుచున్నదా?

జ—తమ యనుగ్రహమువలన జామాతృరత్నమును నలంకరించును.

వి—యుక్తము.

జ—[విలోకించి] భగవంతుఁడా!

క. సకలజనలోచనోత్సవ, నికరమునకు నిరవుగ నిట నెగడు నెతం డీ

సుకుమారుఁడు హారితమణి, ప్రకరము కల్పద్రుమ మన భ్రాంతిఁ గొలిపెడున్.

శ—ఇతఁ డెవఁడు ? ఇతనికే యాతఁడో గదా !

ఆ. నల్లగలువరేకు చాడెంపు మేల్మిగి, చెంతఁ బసిఁడివన్నెఁ జెన్ను మీఱు
ఖంజరీటనయనకర్ణాగ్రమున నున్న, చంపకస్తబకముచందమునను.

వి—పేర వీరిరువురు రామలక్ష్మణులు.

జ—ఆహా ? కర్ణామృతము ! [మఱియు సకౌతుకంబుగ] భగవంతుఁడా ! ఏ మిది !

మ. భవగాధాతిగభావలభ్యము పరబ్రహ్మంబునందు న్మహో
త్సవ మెట్టుం డెద నట్టి నీలజలజశ్యామాభిరామాకృతిన్
దవునీరామునియందుఁ బొందెద మహానందంబు నాకుం దృగు
త్సవదుం డౌచుఁ గడుంగడుం గనఁబడుం దద్బ్రహ్మమే యాతఁడో.

వి—[స్వగతముగ] ఇది యుచితము. సకలలోకలోచనానందకరుఁడు సుధాకరుఁడు కపర్దికపర్దకలిత కలానిధియొక్క పరతత్త్వ మగుఁగదా ? [ప్రకాశముగ] రాజర్షి సౌందర్యాతిశయముయొక్క మహిమ.

శ—ఆ. మిగులరూపరులు సమిద్ధసహజసౌహృ,నులవు వీరియందె దో మదీయ
లసెడితలఁపుఁ గొందు నలకౌస్తుభామృత, కరులయందువలెను గర మరిదిగ.

జ—[నిర్వర్ణించి]

ఆ. ప్రకృతిసుందరులు స్వభావమిత్రులునైన, యీయిరువురియోగమో యనఁగన
దేవజీవసన్నిధివలెఁ దోఁచును నాకు, నింతకన్న వింత యేది గలదు.

వి—ఓయి యోగీశ్వరశిష్యుఁడా ! ఇటువంటి యభినవోదంత సుధావేశంతములయందు నీ మనస్సు మజ్జన మొనర్చుచున్నది. మఱి యీ యిరువురి స్వజనభావమునందు మేము సాక్షులము.

జ—ఈ యిరువురు స్సోదరులా ?

వి—అట్టే.

శ—వంశస్థవృత్తము. స్వవర్ణకాంతిన్ జితచంపకోత్పలుల్
సువర్ణనీలోత్పలసుందరచ్ఛవుల్
తపంగ నేత్రోత్సవదానదక్షిణుల్
ప్రవీణు లీలక్ష్మణలక్ష్మణాగ్రజుల్.

జ—ఎవఁడు మఱి యీయిరువురిచేతను బుత్రవంతులలోఁ గిరీటముగాఁ దలఁపఁబడు వాఁడు ?

వి—మ. ఇవి శీతాంశుమరీచు లాసురనదీహేరాళసద్వీచు లా
యివియుం గేదగిసూచు లాయెచటివి ప్వింద్వక్ష్మసద్రో చులా
యివి యేమంచుఁ గుతూహలాధికలచే బృందారకస్త్రీలచేఁ
దవఁ జూడంబడు చేనికీర్తులు దిశాస్థానంబులం దాడెడున్.

రా—[జనాంతికముగ] వత్సా! యుక్తము. ఇతఁడు సకలగుణవిశదుని తండ్రి నీఁగావ
లయుం గొనియాడుచున్నాఁడు.

ల—ఔను. మఱి తెలుచుగఁ బొగడుదురుగాక!

వి—ఇంతేకాదు.

శా. వ్యాళోద్యద్భుజదండహింఁడితధనుర్వ్యాపార మేవానికిన్
లీలామాత్రముగా నటుంగ నసురీలీలావతీభ్రూలతల్
పౌలోమీకరజక్షతాంకితమునా వాస్త్రోప్పలితేత్ర మా
కాలంబందు నసృగ్విపాటలరుచిం గాంచు న్నిరిం గ్రచ్ఛలన్.

ఇంతియకాదు.

క. ఇనకులకిరీటకోటీ, కనదరుణోపలముకుళముగఁ దగు నతనికిన్
జనపతికి దశరథుని కీ, సనయుంలు తనయుంలు సుధాంశుసమసమవదనుల్

జ—చ. వడిగల వేనిబాహువులు వైరిసతీతతికజ్జలంబునం
దొడరినకాళిమం బనఁగఁ దోఁచునుదాల్చు ధనుఃకిణచ్ఛవిన్
గడిమిని నేని జ్యానినదకాండము చేత నిపీతమయ్యె నా
నడఁగెను సూడుచేడియలయంచితకాంచనకాంచికాధ్వనుల్.

మఱియును,

మ. చెలఁగంగా నెవఁడింద్రశత్రువిజయశ్రీతోడనే యూడ్చినా
ర్వెలతన్ భూవలయంబుతోడనె ధనుర్బింబంబు దోర్దండలిన్
నలిఁ దాల్చు న్మది వేల్పుతేఁ డువిదచంటం గన్నగోర్వంకనే
లలితంబున్నవమున్ శరాసనముఁ గెలంగాదు పోలుంగదా.

[సహర్షంబుగ] మఱియు,

ఆ. ప్రథితమిత్రవంశరత్నంబనం బొరిం, బొరిఁ బరంగునల్లభూపతికిని
దశరథునకుఁ దగినతనయుం లీయిరువురు, రూపవిజితకుసుమచాపు లరయ.

వి—ఇఁక నేమి?

జ—ఆహా! దశరథునిరెండుకనులును పుత్రాలోకనశీతలములు.

శ—దిక్కులును.

వి—దిక్కులని వక్కాణింపం దగు.

జ—అదేమి? వేఱిరువురు కొమరులును దశరథునియొడి నిండించుచున్నారా?

వి—ఔను. రామలక్ష్మణుల ప్రతిబింబములవలె వారిరువురు భరతశత్రుఘ్నులు గదా!

శ—తగుదురు వీరు ఋశ్యశృంగునిచరుభాగధేయములవిలాసములు.

జ—దశరథభాగధేయములయొక్కయు.

వి—ఇది యట్టిదే. భాగ్యవంతులలో దశరథరా జగ్రియుఁడుగదా!

వి—ఆవిషయమందు మే మెవ్వరము వాత్రవ్వఁగలవారము? మీమహిమవిషయమున మీరే సాక్షులు.

జ—దశరథునియొక్క మహిమ ననుసరించుటకు వారిరాశికిఁ గాసారమువలె నే నెవఁడను!

వి—[విహసించి] రాజర్షీ! వినయమధురులకు, అధరీకృతాత్మమహిమలు సత్యవిధురములు వాక్కులు శోభిల్లుచునే యున్నవి.

శ—ఇది యట్టిదే.

వి—ఆ. కనియె దశరథుండు క్ష్మాపతి యాతండు, రామచంద్రుఁ, దృగభిరాముఁ రాముఁ
గంటి వీవు సీతఁ గలవతీవియవంటి, నాటి లోకలోచనాతిరమ్య.

ల—[అపవారించి] అన్నా! ఇందూత్పలినిదృష్టాంతముచేత భగవంతుఁ డగు విశ్వామిత్రునిచే నేమో సంభావింపఁబడియె.

రా—[సప్రణయకోపంబుగ] అళీకజల్పితముచేఁ జాలు.

జ—[స్వగతంబుగ] ఈ వాక్పరిణాళికచే నిమి దిలీప కుల మంగళ మే మో యభిసంధించుచున్నాఁడు. ఎట్లు? [నిశ్వసించి] సరే. సరభసవచనుండు శంకరశరాసనమును స్మరింపకున్నాఁడు. కాని. [ప్రకాశంబుగా] భగవంతుఁడా! నీయొక్క యీ వక్రక్రమనీయవాగ్విలాసముచేత రెండవ ఖండపరశుకోదండమో యన నొప్పుచున్న కుతూహలము గలవాఁడ నగుచున్నాఁడను.

వి—[స్వ.] ఏల యీతఁడు చంద్రశేఖరచాపారోపణ ముద్భావించుచున్నాఁడు! అవుఁగాక. [ప్ర.] రాజర్షీ! చక్కఁగా స్మరింపింపఁబడితిని. నామనస్సు భీమకార్ముకాలోకనమున మిక్కిలి వేడ్కఁ గలిగియున్నది. కానఁ దదానయమునకై నియోగుల నియోగింపుము. అటు గాకున్న నన్యులచే నేమి? రామచంద్రుఁడే నిరూపింపఁబడుఁగాక.

జ—భగవానుఁడా! ఎఱుఁగ వేమి?

మ. ఇదదే యొద్ది సురాద్రిగం బరఁగ విల్లెత్తంగ దుస్సాధ మెం
దొదవె న్నారిగఁ బన్నగేంద్రుఁ డిషువై యొప్పొంద గోవిందుఁడుక్

వృషుచే వంపుగ వంకఁబడ్డదియుం జై యిష్వాసతత్యున్నతిన్
గడితెం గ్రాలెఁ బురాంగనాశ్రుపులవానన్ శాక్రమైశంబునై.

వి—ఎఱుఁగుదుఁగదా !

మ. పరిచర్యాగతసర్వఖేచరకరప్రాంచచ్చలచ్చామరో
త్కరజాతానిలపానపీనగుణభూతవ్యాళపాశర్షిచేఁ
బరమాకర్షణజృంభమాణతుహినవ్రాతాప్తిచే దేవ నీ
శ్వరుచేత న్విడువంబడెన్ క్రమమదే శైలేశసారం బిదా.

జ—ఇట్టుండ నెట్లు ముగ్ధుఁడువోలె దుగ్ధముఖుని రామభద్రుని భీమబాణాసనానయన
మునకు న్నిరూపించుచున్నావు ?

వి—కేవల మానయనమునకే కాదు; ఆనమనమునకును. [రాము నుద్దేశించి] వత్సా! సిద్ధ
పదము. ఇదియును,

క. మారీచమారిచతురము, క్రూరసుబాహునికి దుష్టఘోట్టాణంబున్
ఘోరము తాటకకుం గో, ట్టారా విలు లక్ష్మణుకరమం దునుపుము మున్.

జ—భగవానుఁడా ! ఇ దేమి, అచుంబిత మనువర్ణించుచున్నావు ?

వి—ఎట్టిది మీ కవిదితము ? ఎందువలన ననఁగా, నీతనిచేత.

క. పొంది ధనుర్నిగమము లాగి. వ్రందించి నిశాచరుల శరంబులచేతన్
బొందుగ మఖరక్షయె స్వాకుం దగఁ గావించినాఁడు గురుదక్షిణగాన్.

జ—[సహర్షంబుగ] ఎట్లు వీఁడు వీరావతారుండు కుమారుండు ? [విమర్శించి, మఱి
నిట్టూర్పు పుచ్చి], భగవానుఁడా !

క. మారీచాదినిశాచర, వారశిరోమణిమరీచిభాసితపదుఁడున్
మారారిగిరివిచాలన, సారబలుఁడు వీరుఁ డిట నశక్తుం డయ్యెన్.

వి—ఆ ! ఇంతతో నేమి? ఓయీ! అందువల్లనే రామచంద్రుని న్నిరూపించుచున్నాను.

జ—[తనలో,]

మ. సుతకళ్యాణమువుని స్తమిస్త్రభువనస్తుత్యంబు ప్రఖ్యాతమే
కృతికాకాళిఁకుఁ డీమహీశ్వరుఁడు దా నెట్లా ముద్ధోత్కంఠుఁ డ
ప్రతిమం బీశధను స్సనం గహానమా రాముండు బాలుం డెటో
మతి నా డీయెడ నూఁగులాడెడును బల్మా టోలి డోలాగతిన్.

[వసుధ నవేక్షించి,] ఓ దేవీ !

ఉ. సుందరి పుష్పబాణసతిచొప్పున నొప్పు జనాళిలోచనా
నందిని నీదునందిని ఘనంబుగ నాఁ గద పుష్పబాణరా

ట్పుందరుఁ డీకుమారుఁడు గడున్సుకుమారుఁడు వీనిచేతినిన్
బొందుగఁ బొంఁడసీధనువు పుష్పమయంబుగ నున్నఁ జెప్పగున్.

శ—[ప్రణయకోపముతో] రాజా! ఇది యే మని, కర్తవ్యతామూఢుఁడువోలె మాటి
మాటికి నాలోచించుచున్నాఁడవు? మునివచనము ననువర్తింపుమయ్యా!

జ—ఇదె యనువర్తించితిని. వత్స! రామభద్ర! గుర్వాజ్ఞ యనుష్ఠింపఁబడుఁగాక.

రా—[పరికరమును బంధించుచున్నాఁడు]

ప్రతీహారి [ప్రవేశించి] ఒడయఁ డీయు విన్నవింపఁబడుచున్నాఁడు. హాజారమువొగ వల్లఁ
బఱువుఁ జూడ వేఁడి యేఁడో యొకపాఱుఁ డున్నాఁడు. అందువలనం బ్రవేశపెట్టఁ
బడవలసినవాఁడా?

జ—ప్రవేశపెట్టఁబడుఁగాక.

ప్రతీ—[బయలువెడలి బాడబునితోడఁ బ్రవేశించుచున్నాఁడు.]

జ—బ్రాహ్మణుఁడా! ప్రణామ మొనర్చుచున్నాను.

బ్రా—రాజర్షీ! సుమతివి గమ్ము.

జ—[స్వ] ఈ యాశీర్వచనవిధ మస్వాదృశముగా నున్న దేమి? కానీ. [ప్ర] మహర్షీ!
ఇందుఁ గూర్చుండవచ్చును.

బ్రా—ఆసన మేల? నేను సందేశహరుఁడనుగదా. కాన వినుము.

శా. క్షత్రస్త్రీకులకజ్జలోరువిషముం జాలంగముక్ గ్రోలి తా
నీత్రైలోక్యముఁ జేసి తెల్లఁగను గీర్తిద్ధాట్టహాసమ్యుతిన్
గోత్రేప్సాసునిఁ గొల్చు నిష్ఠ గొది నిక్కా నాస్మ్యధర్మాప్తి నో
ధాత్రీంద్రా భృగురాముగొడ్డలి యదే తాఁ జెల్పు నీ కిక్రియన్.

జ—[స్వ] ఆహా! గర్వాంకురముయొక్క వక్రత! కానీ, వి౦దును. [ప్ర] ఏ మది?

బ్రా—సీ. ఇమ్ము నీకన్నియ నెవ్వని కేనియుం నరపతిసుతునకుఁ బోరయుం మాయుం
వును శివధర్మంబు పాడవార్చ బల్కిన యఘమువలన నస్మదప్రియంబు
వలనను విరమింపు వదలవే నీకొండు పంకసంతోషనోపాయసరణి
గల దది మామకవిలసితధారాంబుపూరావగాహం బుదారముగను
(వీరశైవధర్మంబును వినవ దేమొ, కనినఁ దెలిసెదుగాక నాపనిని నీవు
పదపడి విచారపడినను ఫలము గలదె, సావధానుఁడవై చూడు జనకరాజ.)

జ—అందువలనం దానికి నేను, నీముఖమునఁ బ్రతిసందేశించుచున్నాను.

మ. భృగురామాయుధ మైన యోపరశువా యీ వౌట నామిత్రమి
ప్పగిదిం జెప్పెద నిప్డు డేఁడు హరచాపం బెక్కిఁడు న్వానికిన్

దగ నాకన్నియ నిత్తు నిత్తఱిన పంతం బారఁగా నంత నా
వ్వగునాయల్లునిముందఱ న్వ్రీడువఁగా నా నీదుధారాంబువున్.

బ్రా—అవుఁగాక. [అని నిష్క్రాంతుఁ డయ్యెను.]

జ—[జనాంతికముగ] అంతవఱకు జామదగ్న్యునిచేత నిజకోపాగ్నియొక్క విస్ఫులింగము వేయఁబడినది.

శ—ఇంతమాత్రాన నేమిభయము? గంభీరభుజసారకీర్తిరవాగాముఁడు గదా, రాముఁడు.

వి—ఓయీ! వీ రేరు మణిమండితమకుటులు వేనవే లగపడుచున్నారు?

జ—ఆ. భవధనుస్సైరస్తబాహుగర్వులు సర్వ, భూమిపతులు వీరు పొలంతురుగద
కొనుచు నాదుపూజఁ గొన్నాళ్లుగా నున్న, వార లిచటఁ గుశికభవముసీంద్ర.

వి—వత్స! రామా! వీరి యెదుఱనే యీ చంద్రశేఖరుని ల్లెక్కుడుటచేత మము సంతోషింపింపుము.

రా—వల్లె [యని, పరిక్రమించి, నిష్క్రాంతుఁ డయ్యెను.]

జ—అంగిరసా! అపరిశీలితసన్నివేశుఁ డగు రామునికి నీచేత సన్నిహితము గలుఁగుఁ గాత. తమ్మిపూదండతోడఁ గూడిన కేలుదామర గల సీతయొక్క స్వయంవరాంగణావతరణమునకుఁ గంచుకి పంపఁబడుఁగాత.

శ—అట్లే. [యని నిష్క్రాంతుఁ డయ్యె]

కంచుకి—[ప్రవేశించి] జేరియానతి నెఱవేర్పఁబడినది.

వి—రామచంద్రుని యీ వైజయంతీధ్వజదండము హరకోదండ మెట్లు లేచినది?
[వెండియు సకౌతుకంబుగ,] వత్స లక్ష్మణ! చూడుచూడు.

క. శిశు వవు రామునిచేతక్, శశిధరధను వాటగా నెసఁగ వంపఁబడెక్
దశదిశల నొందుదవ్వగఁ, బ్రసరించెఁ దదీయగుణమురవ మబ్రముగాన్.

ల—ఇది యిట్లే. ఇప్పుడు గదా?

శా. ఆయెం బూర్ణము లేదిశల్ శివధనుర్వ్యాభ్రజాచలచ్ఛన్నదుర్
ఙ్ఞేయానేకగుహాగభీరకుహరస్ఫీతప్రతిధ్వానముల్
స్ఫాయజ్జ్యాయితసర్వరాజముఖసంసర్పద్వచోరాజిసం
ధేయారోహ్యరయశప్రశస్తులుఁ బ్రవర్తిల్లంగ మార్వీధ్వనుల్.

జ—ఇది యేమి చెప్పుచున్నావు? దిశలు పూర్ణము లని, వీనిచేఁ గదా!

అమృతవాహిని. శ్రీరామాస్ఫాలితేశానో, దారధర్మగుణధ్వనుల్
గూరంగఁ బంతము స్నామ, నోరథం బయ్యెఁ బూర్ణమున్.

ప్రతీహారి—[ప్రవేశించి, కంచుకి నుద్దేశించి,] ఇపుడు చూడు వేడుక, సీతారాములచే వెండియు ముక్కంటివి ల్లెక్కువెట్టుట తుదముట్టింపఁబడుచున్నది.

కం—[సకౌతుకంబుగ, ఎట్లో విలోకించి విమర్శించి విహసించియు,] ఓకీ! తెలిసెను, ఇం దిదిగదా!

మాలిని. కరకిసలయలీలం గాంచుముక్కంటివి ల్దా
శరధి యుఱక యాకర్షణంబుఁ గావింప వంకన్
సరభసరసయుక్తిం జాలఁగాఁ గ్రాలుసీతా
తరుణికువలయాంచ ద్దామదృష్టు ల్నిగిడ్చెన్.

స—[ససంభ్రమంబుగ] భగవంతుఁడా! అత్యాహిత మత్యాహితము. ఇది గదా.

మ. హరి నిద్రం దొలఁగించి సర్వనృపశౌర్యావార్యగర్వంబు ని
ర్దరఁ బొందించి దిశేభకర్ణములపొత్తుం ద్రుంచి తామేటి మే
టిరహిం న్నొంచి యుగాంతకాలఘనకోటీగర్జ నిర్జించి సం
భరితంబయ్యె వికర్షితేశ్వరధనుర్భంగోద్భవధ్వాన మే.

ప్రతీహారి—ఇపుడు కడు నబ్బుర మబ్బురము.

ఉ. కొండగవిం గడున్నిదురఁ గూరియుం మేల్కొని యుల్కి సింగముల్
మెండుగ మ్రోయు మార్సెలఁగ మిక్కిలి త్రెక్కొని మజ్జగంబుల
న్నిండియుం బమ్మ గ్రుడ్డఁ యెయ నిగ్గఱ మామ్మెనవాలు దాల్పువి
ల్దుండులు గాఁగఁ బట్టి యిది లేఁచును బిట్టులివట్టె నెట్టనన్.

శ—రాజర్షీ! తలరుదువో? అలరుదువో? ఇది చూచిన ట్లుపవర్ణించెద.

మ. కను మాకర్ణము గాఁగ జ్యాలతను లాఁగన్ వ్రేల్చి గుల్లారయుం
గనుభ్రూభంగము లేదు రామునికి భగ్నంబయ్యె నీశానువిల్
ఘనకంఠధ్వని లే దహంకృతిజహుంకారంబు జీర్యద్ధను
ర్గుణటంకారము తద్విభంగరవ మొక్కొం డెల్లెడ న్నిండెడున్.

జ—ఎట్టు లింతవట్టు మేరమీఱి పోవుచు నీవత్సుఁడు నివారింపఁబడ కున్నాఁడు!

శ— ఎట్లు వారింతుము?

మ. తనరం గంతుకలాంఛితంబుగను నైదై వారఁ గెందమ్మిగా
మను కౌసల్యయొసంగుమంగళసరంబుం గల్గునీబిడ్డకే
ల్మానయుం గొంచె మదంతలోనె విదళద్భూతేశచాపోచ్చల
త్స్వనవారాశి మునింగె నింతగ నహో త్రైలోక్యమైక్యంబు గన్.

కం—చూడుచూడు. వేడుక.

శా. క్రీడాభగ్నగిరీశచాపవలయుఁ క్షిత్యాత్మజాతార్పిత
శ్రీలీలాంబుజమాలికా ప్తహృదయుఁ శృంగారవీరాంచితుఁ
వ్రీడావాంచితవక్త్ర రామునిని మున్వీక్షించు రాజాళికిఁ
జాడం గ్రోధవిషాదవిస్మయసుతుష్టుల్పొంచు నూర్పుల్ల ఖిన్.

జ—ఈ భగవంతుఁడు, జానకీరామభద్రుల పాణిసంఘటనమునకు సభ్యర్థింపఁబడవల యును.

శ—ఏ మని ?

క. ఇపుడే పేర్పడినది యా, విపులార్థధనువున నె సువిదితము గాఁగ
నృప కూర్పంబడియెఁ గదా, విపులాపుత్రికిని రామవిభునికిఁ గరముల్.
కావునఁ గేవల మూర్మిళాలక్ష్మణులకుఁ బాణిగ్రహణార్థ మభ్యర్థనీయుఁడు.

వి—[నవ్వి] ఇదియుం గానీ.

క. జనకునితనయలఁ గైకొను, ననుజులతోఁగూడ రాముఁ డనువొందంగ
మనుసీతాకల్యాణంబును గావించుకొనుఁగాత ముదము దలిర్పన్.

జ—[సహర్షంబుగ] భగవంతుఁ డెట్లు మాండవీశ్రుతకీర్తులతోడఁగూడ భరతశత్రుఘ్ను లకును సంబంధ మభిసంధించుచు నిమికులమాంగల్య మభిసూచించుచున్నాఁడు అందు వలన భవదాజ్ఞాప్రసూన మిది తాల్పఁబడుచున్నది. కావునఁ గోరిక నెఱవేర్చికొను న్నము. [అని యందఱు న్నిష్క్రమించుచున్నారు.]

ఇది తృతీయాంకము.

# ఆంధ్ర ప్రసన్నరాఘవ నాటకము

## చతుర్థాంకము.

[తెరలో, పరశురామునిప్రవేశికి పాడఁబడుచున్నది.]

క. మణిమయమంగళదీపము, జనకనృపునిమండపమున జ్వలియించు లలిన్
జనుదెంచెం జండానిల,మును విఫలాగమముగ నగు మొగి నెట నటుకున్.

[మఱియుఁ దెరలో] ఓరీ! క్షత్రియులారా! చూపున కందక తొలఁగి పొండు.
ఇం దితఁడు గదా!

సీ. భానుభానుసటావిపాటలంబగుదృష్టిపాతంబునం బరశ్వధమిపుడును
క్షత్రకంఠచ్యుతక్షతజసరిత్సిక్తధారంబుదారంబుగా రచించు
చటితీవ్రనిశ్శ్వసనాభీలమారుతోద్ధతిచేత వెండియుం క్షితికి క్షతిని
సూచించుచున్ మౌర్వి నేది ప్రోయించుచు శార్ఙ్గి యాతండె నాశార్ఙ్గహస్తుఁ
డగుచు ముజ్జగముల గెల్చి పొగడు గనిన, యల్ల జగదేకశూరుండు బల్లిదుండు
రుద్రశిష్యుండు మాఱటరుద్రుఁడనఁగ, జామదగ్న్యుండువచ్చునిచ్చటికిఁ గనుఁడు.

[అంత, జామదగ్న్యుఁడు ప్రవేశించుచున్నాఁడు. ఎ. ససంరంభముగ.] ఆహా!
సీరధ్వజునియొక్క ధృష్టత్వము. అందువల్ల సీతఁడు ముక్కంటివి ల్లెక్కిడువానికి
కన్యాదానము సేయఁ బూనినాఁడు. [సక్రోధంబుగ పరశువు నెత్తికొని],

క. మహిపతితతిగళపాళీ, బహుళగళద్రుధిరధౌతబహుధార మిదే
యహిభూషణశిష్యునియది, మహితముపరశువజనకము మహిని నొనర్చున్.

[విమర్శించి, కనికరముతో]

క. కలిగితి వర్ధనభుజవని, వెలిఁగితి వుత్తుంగభూమిభృద్వంశములన్
లలినిమిథులకలమపలా, లలవము నీవంటెదె మరలన్ రోషాగ్నీ.

[ఆలోచించి,] అటుండనిమ్ము. కోరఁబడిన యల్లునిచేతి బలిమి గరువమువలన నడరు
వీనియొక్క యేడ్తెఱచేతఁ జాలు. వీనిచే సందేశింపఁబడియేఁగదా నా గంద్రగొడ్డలికి.

"మ. భృగురామాయుధమైనయోపరశువా! యీ వేట నామిత్రమి
వ్వగిదిం జెప్పెద నిప్పుడేఁడు హరచాపం బెక్కిడు న్వానికిన్

దగ నాకన్నియ నిత్తు నిత్తఱిన పంతం బారఁగా నంత నా
ప్పగునాయల్లునిముందఱ న్విడువఁగా నా నీమధారాంబువున్.''

[అని యీ పద్యముఁ జదివి,]

ఆహా! వీని ధార్ష్ట్యము! ఏమి చెప్పెను? ''విడువఁగా నాసీదు ధారాంబువున్'' అని.

మహాస్రగ్ధర. తనరంగన్ దేనిధారన్ దళితపరిపత ద్బాహుశాఖాసహస్రం
బున నుద్యద్రక్తధారల్ పొలిచె జితనవాంభోజమిత్రాంశుజాలం
బనఁగం దత్కార్తవీర్యం డమరపురసుదృ గ్వర్షదాపుష్పితాశో
కనగంబయ్యెన్ స్వశౌరాంగనల కధికశోకప్రదాశోకమయ్యెన్.

మఱియును.

శా. రేవావాహినిఁ గట్టెఁ గట్టువఱిచెన్ రేకెత్తునారావణున్
దేవారాతి నచెద్దియర్జునభుజానీకం బెట స్మగ్గిరా
ద్ద్వేపీదృగ్జలపూర మన్నెపమునం దీపించు నెద్దానిక్రీ
డావారం బది యిద్ది నాపరశు వీడన్విడ్చు ధారాంబువున్.

[విలోకించి] ఎట్టు వీఁడు శతానందశిష్యుఁడు తాండ్యాయనుఁ డిచ్చటనే వచ్చియున్నాఁడు?

తాండ్యాయనుఁడు [ప్రవేశించి] భగవంతుఁడా! అభివాదనము సేయుచున్నాఁడను.

జామ—ఆయుష్మంతుఁడ వవుము. నీ యుపాధ్యాయుని యజమానునియొక్క త్ర్యక్ష చాపారోపణశ్రద్ధ యెట్టంతవఱకు వదలెను?

తాం—భగవంతుఁడా! ముక్కంటివిల్లెక్కిడుటతోడనే వదలినది.

జా—ఆ! ముక్కంటివిల్లెక్కిడుటతోడనే వదలిన దనియా?

తాం—విస్మట సేమి?

జా—ఏమి జరిగినది? అంతయుం జెల్లముగం దెలుపుము.

తాం—క. ఎవనికిఁ భగ్నంబయ్యెన్, శివధనువుస్వబాహుదండసిద్ధబలమునన్
శివశిష్యపరశురామా, యవలీలన్ హస్తికిక్షువనఁగా నహహా.

జా—ఎవనికి?

తాం—క. గాధిసుతయజ్ఞఘాతకు, లాదైత్యులు తాటకేయు లై రేనికిహా
స్తాధీనులు,

జా—చాలుఁజాలు. ఎఱుఁగఁబడినాఁడుగదా, దుర్జనాగ్రణి దోషాచరగ్రామణి.

తాం—[తనలో] రావణునిచేత విల్లు విఱిగె నని యీ భగవంతునిచే నెట్లెఱుఁగఁబడెనో! అంతవఱకు నిట్టె కానీ?

జా—[సక్రోధంబుగ, గొడ్డలి నెత్తుకొని,] ఇది యిది,

ఆ. రాజపుత్రకంధరానాళదళనక,లాపకలము నాదిగా కుఠార
మింకc బఙ్క్తిముఖుని మిక్కిలిచిక్కని, కుత్తుకలను దవిలి కోయుcగాక.

[విమర్శించి] అట్లేని,

ఉ. కొండలకొమ్మలం జిదిమి గొప్పతనంబును గాంచి మించునా
ఖండలువాలు సిగ్గునయcగం గడునర్జునబాహుశాఖలన్
జెండి పరేతరాజపురిc జేరcగ వాకిలియైన దిట్ట నా
చండపరశ్వధంబునకు శ్లాఘయె రావణకంఠఖండనన్.

[మఱియుం విచారించి,] అట్టయినను మహాపరాధముగల మానవాధమునియెడ నుదాసీన భావముc జెందుట యయుక్తము. అందువల్ల నిప్పుడు,

తే. దక్షిణాంభోధిమధ్యమస్థానమునను, గొంకణము నెన్నిదవదానిc గొఱలc జేసి
లంక కాతంకమును మిగులంగc జేయు, నస్మదంబకభూతాగ్ని యడరుcగాక.

[అని, పరిక్రమించుచున్నాcడు.]

తాం—ఇప్పుడు క్షత్రియకులమునకు క్షేమము. [నేపథ్యమందు] నియోగులారా! వివాహమంగళమున నెసంగు జానకీరామచంద్రులకు స్వస్తివాచనికులగు బ్రాహ్మణులc బిలువుcడు.

జా—ఓరి బ్రహ్మబంధూ! ఎట్లు దబ్బఱగా, దశకంఠకీర్తనుcడవైన నీచే నేను మోస పోతిని? జనకునల్లుcడు వేఱెవ్వcడో కాcబోలు.

తాం—భగవంతుcడా! నాదుక ల్పేది? నేను సగము చెప్పcగానేకదా, మీరు భ్రాంతు లగ నైతిరి?

జా—అది యంతయుం దెలుపుము.

తాం—క. గాధిసుత యజ్ఞఘాతకు,లాదైత్యులు తాటకేయులై రేనికి మా
స్వాధీనులు తేజోలవ,బాధితులై పరిభవంబుc బడసి రరిదిగాన్.

జా—ఓయీ! తాటకేయదమనుcడు వీc డెవcడు?

తాం—క. మునుబుశ్యశృంగచరువున, జనియించినదశరథసుతసముదయమున నీ
యన పెద్దవాcడు రామా,ఖ్యనుతుcడు గాధేయశిష్యుc డసదృగ్బలుcడో.

జా—చ. ఎది విధివోలె వక్రత వహింపc ద్రిలోకవసజ్జనాళికిన్
మదమఱc జూడcగూడనిది మానెను బ్రాహ్మ్యయికాలికాలి యా
యది శివధర్మమీదశరథాత్మజుచేతను భగ్నమయ్యెనే!

శతా—[భయకౌతుకములతోఁ దనలో] ఇతఁ డేమి చెప్పునో ?

జా— ని దలఁపు శస్త్రధారను మునింగెను రాఘవవంశ మంచువా.

శతా—ఈ భగవంతుఁడు సంరంభించినాఁడు. కావున నీవృత్తాంతమును గురువునకు విన్నవింతును. [అని నిష్క్రమించెను.]

జా—[విలోకించి] అభినవవివాహమంగళ వేషమ్మువలనం దమ్మునితోడఁ గూడుకొని యున్న రఘురాముఁడు వీఁడే యని యూహించుచున్నాను.

[అంతట, రామలక్ష్మణులు ప్రవేశించుచున్నారు.]

లక్ష్మణుఁడు—[చూచి, తనలో,]

మ. విలునారిన్ మయియొద్ది మౌంజిని సదాప్తిం దాల్చుఁ దీక్షాగ్రముల్
విలసిల్లున్ ములుకుల్ కుశల్ గరమునన్ విద్యోతధారంబునూ
జ్జ్వలమౌ గొడ్డలియుం గమండలువు నిచ్చ న్వీరశాంతంబు లె
ల్లెలమిం గూడెను జూడ నిట్టులొకఁ డున్నే యబ్ర మెందేనియున్.

ల—అన్నా! ఇదియేమి? ముందఱ, బ్రహ్మక్షత్రవర్ణమయమయినది (రూపము) చిత్రము వలెఁ జూడఁబడుచున్నది ?

రా—తమ్ముఁడా ! భగవంతుఁడైన భార్గవునిని నీ వెఱుఁగకున్నావు ? ఇతఁడు గదా!

కవిరాజవిరాజితవృత్తము.

ఎవనికి భేద్యము క్రౌంచమహీధర - మెవ్వని కేయిలదేయము మ
న్నవనికి నూతనభూస్థితిఁ గైకొన - నెంతయుఁ గబ్ధినిధేయుఁడు దా
నెవనికి జేయుఁడు తారకజేతయుఁ - నే నిదియౌ పెనుగొడ్డలికిన్
సువిదితహైహయబాహువనం బనిఁ - జూడఁగ ఛేద్యమునయ్యె నహో.

—ఐన నీతఁ డచ్చెరువందం దగిన సచ్చరిత్రుఁడు.

రా—విస్మయనీయశీలురకు శిఖామణి యని చెప్పనొప్పు. ఇతఁడుగదా !

ఉ. బంగరుకొండయొండె గలపంటవలంతిని దీని హైమవ
చ్ఛృంగ మొకండె యుండు పసిచెల్వునఁ గశ్యపమౌని కిచ్చె దా
నాంగముగం గిరీశలనయాధికశక్తియుఁ దూఁటువేయఁ లే
మిం గని కొంచగుబ్బలిని మించి సురంధ్రముఁ జేసి మల్కిచేన్.

జా—[విలోకించి,] వీఁడర్థముగ్ధుఁడుగదా ? ఎందువలన ననన్ వీనిఁ గామ యని చెప్పుట యందు రాముఁ డని పలుకుచున్నాఁడు. [విమర్శించి] మఱియొకతెఱఁగున నేనే

మూఢుఁడను. ఎట్లన, క్రిందుపఱుపఁబడిన కామసౌందర్యసంపదఁగలవానిని, కామ
సమీకరణమువలనఁ గ్రిందుపఱుపఁ గోరుచున్నాను. [నిర్వర్ణించి]

ఉ. చక్కదనంబు మిక్కిలిగఁ జాటునుగా మునికన్నమిన్నయం
చెక్కువయైనకైబలిమి యీశ్వరు శ్రీశ్వరుఁ జేయఁ గ్రిందుగన్
మిక్కిలికంటిమాశికశిమేలిమిఁ గాంచును మార్గ్య మన్న నీ
చక్కనిమూర్తి రెట్టులు రసత్రయి గొర్మితమమ్యె పియ్యెడన్.

రా—[సమీపించి] భగవానుఁడా! సానుజుండనైన నా నమస్కార మిదిగో, పరమో
న్నతిరమణీయపరిణామము.

జా—వత్సా! కలహావిజయివి కమ్ము.

రా—భృగుకులశిరశ్శిఖండుండా! అనుగృహీతుఁడ నైతిని.

జా—[విమర్శించి స్వగతంబుగ,]

శా. వీలాసద్విపయాత్రుఁడున్ శిశువునా సీరాముఁనం దీరసం, బు
[స్మరించి, సక్రోధంబుగ]
జౌలే శూలిశరాస మి గావా పీఁడె ఖండించెఁ గా
[విచారించి, సకరుణంబుగ]
బాలారత్నముసీత నాశరిమునన్ వైధవ్యముం బొందరా, దు
[మఱియు సదర్పంబుగ]
వీలాకాంతమవుం బరశ్వధము నాదీకేణుకావైరియున్.

[ప్రకాశంబుగ]
ఓయి దాశరథీ! నీయెడ నాది యీయాశీర్వాదసరణి, సదాచారానుసారిణి, వాగ్వృ
త్తియే చుమీ.

రా—[చిఱునవ్వునవ్వి] భగవంతుఁడా! చిత్తవృత్తి యన నెటువంటిది?

క. ముక్కంటివింటి విఱుచుట, మిక్కుటమగుగర్వముఁ గని మెఱసెడుఁ గడు నీ
యొక్క భుజంబులు పీనియ,సృక్కనఁ బరశువున నేను ద్రుంచెదఁ దునుకన్.

రా—నీ నిగ్రహానుగ్రహములకు స్వజనుఁడు వీఁడు.| కోపకారణము మెఱుఁగ గోరు
చున్నాఁడ.

జా—ఆహా! గర్వాంధకారము. నీవు చేసినదియును నేను జప్పినదియు దుర్వినయముమున
జ్ఞప్తిఁ గనకున్నావుగా! వినరా!

క. ఎది యిపుడను త్రిపురాసుర,సుదలీవిరహవ్రతంబుఁ జొప్పడఁ జెప్పన్

విదితముగా నున్నది యది, విదితము శివధర్మమయ్యె విదితము నీచేన్.

రా—భగవంతుఁడా ! అళీకలోకవార్తచేత నిరపరాధుఁడనైన నాయం దిట్లేల ఆ
చున్నావు ?

జా—ఐన నీశానశరాసనమునకు యథాస్థితియా ?

రా—కాదు కాదు.

జా—ఐన నీ వెట్లు నిరపరాధుఁడవు ?

రా—క. తాఁకంబడియెనో నాచేఁ, దాఁకంబడలేదొ శివునిధనువు తనంతన్
ప్రేఁకఁబిఱిగె మహాత్మా, శ్రీకంఠసుశిష్య యేమిసేయుదు నెఱుఁగన్.

జా—చంపెనదిగ్ధముఖంబగు శిలీముఖంబును నాటి నాయుల్లమును జల్లఁజేయుచున్నా,
[కుఠార మెత్తికొని]

ఆ. ఓరిరామ కామవైరికార్ముకమర్మ,ఘాతజాతపాతకా కఠోర
ఘోరమీకుఠారధార సీతాకర,గ్రహణ మెఱుఁగ నీదు గళముఁ ద్రెంచు.

కావున నీవు వీరుఁడ వవుము.

రా—సీ. హరమొ నీకుఠారమొ మహామహ యుండెడుమాకు గుత్తుకల్
నారులకన్నుల నెన్నగడు నల్వగఁ గజ్జలమో జలంబొ చె
ల్వారఁగ వేసుఖంబొ పితృభర్తముఖంబొకొ కంచుమేదొకా
నీరసయందు విప్రతతి నెప్డుఁ బ్రవీరుల మేము గామయా.

జా—ఆ! నన్నున్నమనస్కారమునకర్హుఁడైన బ్రాహ్మణసామాన్యునిఁగా నెన్నుచున్నావుగా!
[సాక్షేపంబుగ]

ఉ. ఎఱుఁగుదె జామదగ్నిగుహుఁ డేపునఁజేసి నియుద్ధమాని నా
చెఱకయిబల్మిఁ బోకడఁపనేరక క్రోధముతోడఁ జూచెను
క్కెఱితిమును గాలకంధరకరాంచితకాంచనగర్భమస్తకం
బుఱు నని యాస్యవైఖరినొహో కనెదే బలమున్మదీయమున్.

[ససంరంభంబుగ] ఏమిచెప్పితేమిచెప్పితివిరా! "రసయందు విప్రతతి నెప్డుఁ బ్రవీరుల మేము గామయా" యని, ఎట్లు రాచకొలపు గరువమున నేలవేలుపు వంగడమును గఱకపరకవలెఁ దలఁచుచున్నావు? అందువలన నిపుడు మనయొక్క వర్ణములలో నేది గొప్పదో దానిని గలహాతులయే నిర్ణయింపఁగలదు. కాఁబట్టి కలనికిం గట్టాయి తమ్ముగఁ గమ్ము.

రా—శా. సీతోఁబోటనుమాట యంటయును జన్నే మాకు విప్రోత్తమా,

ఖ్యాతుల్ మీరలు సద్బలాఢ్యులరు మే మాచుందుమద్యామ్ను లే

ల—సత్యమే యిది.

నీతం జేకగుణంబు మాకు విలువూన్కిన్ జేంద్లకు స్మీకసన్
ఖ్యాతంబౌ నవమాగుణంబు బలమై యజ్ఞోపవీతం బిలన్.

రా—అబ్బాయీ! మాననీయుండైన మునియెడ దుర్వినయవైదగ్ధ్యము దగదు.

జా—వీని కేమిదోషము?

రా—భగవంతుఁడా! ఇపు డీక్షీరకంఠునియెడఁ గఠినమయిన కోపముఁ గావింపఁదగదు.

జా—ఎట్లు వీఁడు క్షీరకంఠుఁడు? విషకంఠుఁడుగదా వీఁడు.

ల—విషకంఠశిష్యుఁడా! అట్లయినన్, మిక్కిలి క్షమింపవలయును.

జా—ఆ! విషకంఠనామసామ్యమువలన భగవంతుఁడయిన శ్రీకంఠునివలె నీవును గురువా
నాకు?

ల—[విహసించి] ఎట్టన్యథాజ్ఞానము నిన్ను వ్యథపెట్టుచున్నది? నావిన్నపము వేఱుగానే
చుమీ. అ దెట్లన్నన్

క. చూడాగ్ర మెక్కనేనియు, బాలప్రాలేయపదుఁడు భవునిమనమునన్
గ్రాలునె కోపం బెపు డే, నేలాగున నేని లీలనెనయుం గాదే.

అందుచేతం దదంతేవాసి యగు నీవును నాయెడ క్షమింపఁదగుదువని.

జా—[స్వ.] ఆహా! ఈరాచకఱ్ఱనిమాటనేర్పు! కానీ. [ప్ర.] నాయోర్పును.

రా—[స్వ.] జామదగ్న్యుండును క్షత్రియజాతియందు క్షేమముఁ గనుచున్నాఁ డని
నాకుఁ గౌతుకమును.

జా—ప్రకృతికఠోరమైన యీనాకుఠారమైనన్ క్షమింపదు.

తే. తనదుధారను క్షత్రవధం బొనర్చి, నెత్తురెమ్ములు సేఱులెందు నొరయరెంట
నేయదిత్రివర్ణయుతనుగాఁ బృథివిఁ జేసె, నట్టి యీగొడ్డలిదిశల మెట్టెఱుఁగవు.

[వెండియు స్సంరంభంబుగ] ఇంతేకాదు. ఎట్టిజామదగ్న్యునిగండ్రగొడ్డలి బాలుఁ డని
తలఁచును?

మ. తొడరన్సంగరమందుదేనిదియ యాదుర్వారధారాహతిన్
గడునీరేణుకయయ్యె క్షత్రశిశురక్తవ్యాప్తిచే ధాత్రి య
క్కడఁ దద్బాలకుల స్మరించు సుమనఃకన్యాళిలీలాంబుజో
జ్జ్వలదామంబులదోపరాగమున నాస్వర్గంబు రేణాత్కమున్.

ల—నీకుఠారధారచే ధారణి నీరేణుక యయ్యెనన్నందున నిందాఁక సత్యము

జా—[తనలో] వీఁడు రేణుకావృత్తాంతముచేత నేతీరున మదిఁ దాఁక నాడుచున్నాఁడు ? [ప్రకాశముగా,] ఓరీ ! నిరపరాధుఁడవైన, నీవిషయమునఁ దాలిమి చాలును. కటువులైన మాట లాడిన నీకంఠము గండ్రగొడ్డటి వ్రేటుచేతఁ దెగఁగొట్టఁబడును.

[తెరలో] జామదగ్న్య ! జామదగ్న్య ! ఏల ప్రేలుచున్నావు ? అందువల్ల నిన్నుం దండింప విల్లందుకొనుచున్నాఁడను.

జా—[స్వ.] ఆ! అల్లునియెడఁ బొడమిన యర్మిలివల్ల వెలువడినవాఁడు వీఁడు. ఆలోచింప నేల ? [బిగ్గరగా] ఓయి ! యోగీశ్వరశిష్యుఁడా ! నీకు శరాసన మేల ? పద్మాసన మవలంబింపుము. [మఱియు సోపహాసముగా.]

శా. ఓరుద్రాక్షసరోజ్జ్వలద్గళులుగండో శ్రోత్రియక్షత్రియుల్
ఘోరాజిం బొనరింప శక్తి యెది మీకుం గోర్కి వష్మేయపుణ్
వా రస్యుల్గద పంచశాఖకలితప్రాంచత్కృపాణోరుధా
రారాద్ధూతరిపుద్విపాత్తమదపంకాళుల్ ప్రవీరుల్ వరుల్.

కావున నీవలనఁ గాఁదగిన దేదియు లేదు. ఈ రాచమిడుఁగురులజత రూపుమాపెద.

[తెరలో] జామదగ్న్యుఁడ ! జామదగ్న్యుఁడా ! అట్టిశాంతినిధియైన జమదగ్నికిఁ బట్టిగఁ బుట్టిన నీ వేటి కిట్లు శమధనహీనుఁడ వైనాఁడవు ?

జా—శతానందుఁడు వీఁ డేల వచ్చె ? [ఉచ్చైర్ధ్వనితో,] ఓయీ ! అహల్యానందన ! గౌతమునివలననా, గోత్రధ్వంసివలననా, ఏతండ్రివలన శమాభిధాన మిది నీకు సంప్రాప్తించెను ?

[తెరలో] జామదగ్న్యుండ ! జామదగ్న్యుండా ! ఆ ! పాపా ! క్షత్రియాపుత్రా ! కన్నతల్లికుత్తుక న్నఱికిన గండ్రగొడ్డలి గలవాఁడా ! కులమున కనలమైనవాఁడా ! తపస్తుంగమైన యాంగిరసకులముం గూడ నెట్లు కళంకితముగం గావించుచున్నావు ?

జా—కులపాంసనా ! పాంసులాసూనూ ! సమగ్రతపోగ్రగణ్యంబగు భృగువంశముం గూడ నెట్లాడుచున్నాఁడవు ?

రా—భగవానుఁడా ! భృగ్వంగిరుల తపస్సు భువనవిఖ్యాతము. విశేషముగా భర్గశిష్యునికి విజ్ఞాపనము సేయుఁచున్నాను.

చ. మునులగు మీకు నొఁ దపము ముఖ్యముగాఁగను శాంతచిత్తముణ్
వినుతజపాక్షమాలికయుం విశ్రుతదర్భలుం గుండ గోలయుఁణ్
వనమున నెందునే నుటజవాసము గాని యి దొప్ప దుగ్రభా
షణమును భ్రూవిభంగమును జాపము రోషమునుం గుఠారమున్.

ఇంతియకాదు. ఈవే విచారింపుము.

ఉ. ఎక్కడఁ బూతమా తను విదెక్కడ నీకు నపత్పరశ్వథం
బెక్కడఁ జారుశీల మిది యెక్కడ ఘోరతరోరుకార్ముకం
బెక్కడఁ బర్ణశాల యిది యెక్కడ సుద్ధతయుద్ధసాధనం
బక్కట కాండకాండమరయ న్విషమం బిదియే యవుంగదా.

జా——ఎట్లు వెఱతపసిఁబోలె నన్నును నెన్నుచున్నావు ? నేను జామదగ్న్యుఁడను.

శా. ఛిన్నక్షత్త్రియకంధరాక్షతఝవాత్కీలాపగాస్నాతుఁడు
న్నన్నారాతిశిరోజము ల్గుశలుఁగానుంజేసి మేల్గన్నవాఁ
డున్నా నేఁడిదరక్తతర్పణము లప్పుంగాంచెఁ బిత్రాళిసం
పన్నంబంచును సంతసంబునను నేవన్నిమ్మినవ్వక్కలన్.

కాన నేను,

స్రగ్ధర. ముయ్యేడౌమాఱులున్నున్నొప్పనరిచితి నరిన్ - భూపనిర్వాపణంబున్
గయ్యంబుం జేసి యింకం - గడఁక నొనరుతుం - గాక యట్లేడుమాఱుల్
అయ్యుద్ధంబులందున్ - హతన్పపతిశిరా - ఘూర్ణిఁ గాపాలికంబై
తియ్యంబౌనక్షమాలన్ - దివిరియిడుదు వం - దింతుఁదత్తైత్రపాలున్.

రా——అంజలింజేసి,

మ. కొనుచున్నీవు ప్రసన్నభావమును వాగ్దోషంబునా దెన్న కిం
కెనయించెన్మదిఁ గిన్కనుం బలుమఱున్ హేరాళఘుంగా యశం
బనువిత్తంబును జిత్తముం గితవు నట్లత్యంతముం బాపు నీ
ఘనతన్మిన్నక పల్కకుండుము జగత్ఖ్యాతుండయో భార్గవా.

జా——ఎట్లు పలుకుదును ?

ఆ. వాగ్విడంబకైక వైదుష్యులైనమీ,యెడను బ్రచురవాణి యేమిటికిఁ
బరులయునురుగొనెడు శరముల నా వాని, స్నైఁపుఁ డీర లెల్ల నైరణమెయి.]

రా——[కొంచెము విహసించి,] అన్యులతో నేమి ? నేనే నీబాణపరంపరను, ఖండపరశు
చాపారోపణద్విగుణితసీతాశయకిసలయోపనీత మహోత్పలమాలికాలోలరోలంబ
గానయశఃపరిమళమిళితం బగు నురస్స్థలమున సహింతును.

జా——శా. ఉగ్రక్షత్త్రపురాణధర్మదళనప్రోద్భూతగర్వోన్నతి
వ్యగ్రంబుం డీవన నెంతవాఁడవు మదీయాస్త్రాళికిందాళఖే

దుగ్రామేయతపోమహత్త్వమున మున్నొందె న్వరంబుం దగన్
వాగ్రామాధిపువల్లనీగురుఁడు విశ్వామిత్రుఁడే బ్రాహ్మ్యమున్.

రా—[తనలో] ఎట్టితఁడు పూజనీయుఁడైన విశ్వామిత్రునిఁగూడ నధిక్షేపించుచున్నాఁడు ! ఇంక సహింపను. [ప్రకాశముగా—వెల్లడిగా]

శా. ఉగ్రత్యక్తపురాణధర్మదళనప్రోద్భూతగర్వోన్నతి
వ్యగ్రుం డేనన కొంతవాఁడను ద్వదీయాస్త్రాళికిం దాళలే
దుగ్రామేయతపోమహత్త్వమున మున్నొందెన్వరంబుం దగన్
వాగ్రామాధిపువల్ల నాగురుఁడు విశ్వామిత్రుఁడే బ్రాహ్మ్యమున్.

[మఱియుం సకౌతుకసంరంభంబుగ]

చ. కులిశకఠోరమైనవిలుకోలది భగ్నమె భగ్నమయ్యె నా
వలనను నీహృదిన్ శరమువై ఖరిమగ్నమె మగ్నమయ్యె నే
మొలయును శైవమైన మఱియున్విలువైష్ణవ మైననేమి నా
బలుపగుదోర్విలాసము ధ్రువంబు గణింపదు దేనినేనియున్.

జా—బాగురా ! బాహుజబాలకా ! మిడుఁగురుఁబురువా ! బాగుబాగు. ఎట్లనఁగా, జామదగ్న్యనామకుఁడైన ధామనిధిమ్రోలఁ గ్రాలుచున్నావు. [వెండియుం సాటోపంబుగ] ఏమంటివిరా ! ఏమంటివి ! [కులిశకఠోరమైన విలుకోలది యనుపద్యమును జదువుచున్నాఁడు.]

రా—ఓయి, ఇదే పలుమాఱు చెప్పెదను [అదే పఠించుచున్నాఁడు.]

జా—చక్కఁగా జ్ఞప్తియైనది.

రా—ఏ మది ?

జా—ఉ. దేనిదినారిమ్రోఁత హరిదివ్యకరాహతిఁ గల్గి యంతటన్
వానిసుదామభృంగములధ్వానముచే ద్విగుణంబ యౌను ర
క్షోనళినేక్షణాక్షయసుశోకరవశ్రుతిపారకాళికిన్
త్రాణవముభంగినానదిది వైష్ణవకార్ముకరత్నమే సుమీ.

రా—[సకౌతుకంబుగ]

ఆ. శార్ఙ్గి కేలుదమ్మిఁ జలుపు లీలల నేది

జా— శార్ఙ్గ మద్ది యిద్ది చాపరత్న

మిడుకొనంగ వలఁతివేని గైకొను మిడు
కొనఁగఁ జాలవేనియును విడువుము.

రా—[గైకొనుచున్నాఁడు.]

జా—చేకొన్నావు కావున, కన్నీళ్లుగారుచున్న నీచుట్టములచే దట్టమైన యీచోటుం
దాటి, జగడమున కనువగునెడకుఁ జనెదము. [అని రాములు నిష్క్రమించిరి.]

ల—[విలోకించి, సకౌతుకహర్షవిస్మయంబుగ,]

ఉ. పొందుగ శైవమైనవిలుపోలిక నిద్దియు భంగము న్మతిన్
మందచలద్భుజుం డయిన మా రఘురామునిచేత నీతఱిన్
బొందుగఁ జక్రమట్లొనరెఁ బూర్ణముగాఁగను వంపఁబడ్డదై
యందమునైన వైష్ణవశరాసన మియ్యది వింత యెంతయున్.

[తెరలో] ఆహా! కుతూహలము. కుతూహలము.

మహాస్రగ్ధర.

పోడిమెన్ శ్రీరామబాణంబు మొదట విలసత్పూర్ణబాణాసనానన్
గడిమి న్మిన్నంటె నంతం గలఁచె భృగుసుతఖ్యాతనాకాధ్వము న్వే
తెలిపుల్గా నాఁగ నొప్పెం ద్రిదివసుయువతీదివ్యపుష్పాంచితంబై
గడుఁ గీర్తిం గాంచి వచ్చెం గదిసి పోది కలంకారముం జేయఁజాలన్.

[అంతట రామజామదగ్న్యులు ప్రవేశించుచున్నారు.]

జా—[రాముని విలోకించి నిర్వర్ణించి.]

ఉ. శ్రీకి త్రిలోకి యిద్దియొసఁగుం గని మోదము నేది తోఁచినన్
బ్రాకటమౌ వికాసమున భాసిలు మానిమనోంబుజౌఘముల్
శ్రీకువలాభుఁ డేఁ డితఁడు చెల్వగుబాలుఁడు సన్మనోహరుం
డేకరణిం దదుజ్జ్వలమతీద్యము జ్యోతి జనించె నిట్లహా.

[వెండియుం దన డెందమునందుం దలపోసి,]

క. పురవైరిశరాసనమున, శరముగ నేఁడయ్యవాఁ డొసఁగ బాలుండై
యరిదిగ నీవి ల్లెక్కిడ, నరుదెంచెఁ బురాణపురుషుఁ డని మదిఁ దలఁతున్.

[శ్రీరాముంగూర్చి,] ఓరఘుకులశిరోరత్నమా! ఇటు చూడుము.

రా—[సిగ్గుతోఁ దలవంచుకొని నిలుచున్నాఁడు.]

జా—[ముందుకు జరిగి, రాముని గడ్డము నెత్తి,] ఇది లజ్జాస్థానమేమోయి!

తే. కమలలోచన నీచేతఁ గన్నవాఁడ, నధరభావంబు నీమహిమాతిశయము
చేత నిఁక నీవు దేవతాశ్రేణిమాళి, మణుల నధరీకృతములఁగా మనుపలేవె

రా—[కేలుమోడ్పుతో] చాలునింతతో, దుర్వినయపంకపంకిలుఁడనైన నన్ను భవదంఘ్రి నఖరకిరణతరంగిణీజలమునఁ గడుగుకొనుచున్నాను.

తే. చండతేజమె యుండు మార్తాండునకును, సౌమ్యతేజమెయొప్పుఁ జందురునకుఁ
జండసౌమ్యంబు తేజంబయుండు నీకు, నట్టినీబిట్టుతేజున కమరుతు నతి.

[అని పాదములకుఁ బ్రణమిల్లుచున్నాఁడు].

జా—[లేపి,] ఓయి ప్రకృతికల్యాణనిధీ! ఆశీరుక్తి కూడ నీవిషయమునఁ బునరుక్తియే. అట్లైనను ఇష్టాశీర్వదించుచున్నాము.

కవిరాజవిరాజితము.

వెలయఁగఁ జేయుము దవ్వుగఁ గీర్తిని వేడ్కను గంగ యనంగఁ గడుఁ
లలనలకన్నులనిద్దురచీకటులం బెడవాపెడు వెన్నెలనా
నలరుత మిద్ది జగత్త్రయిత్వద్విశిఖార్దితరావణమూర్ధచయ
ప్రలురనహృష్టభుజంగనరామరరాజివిరాజితమాజిభవా.

నిజాశ్రమగమనమునకు నిఁక నా కనుజ్ఞ నిమ్ము.

[అని నిష్క్రమించుచున్నాఁడు.]

రా—భగవంతుఁ డగు భార్గవుఁడు కంటి కగపడక యెట్లు నిష్క్రమించుఁడ యయ్యెను! వత్స! లక్ష్మణా! రమ్ము. జామదగ్న్యవియోగఖిన్నమైన మానసమును జుట్టములఁ జూచుటచేత సంతోషపెట్టుకొందము. [అని, యందఱు న్నిష్క్రమించుచున్నారు.]

ఇది శ్రీమత్ప్రసన్నరాఘవనాటకమునఁ జతుర్థాంకము.

# ఆంధ్ర ప్రసన్నరాఘవ నాటకము

## పంచమాంకము

[అంతట గంగాయమునలు ప్రవేశించుచున్నారు.]

సఖీ—కాళిందీ ! ఏల కుందుచున్నావు ?

యమున—భాగీరథీ ! కతము గలదు.

గంగ—అది యెటువంటిది ?

య—ఒక కారణ మేమనఁగా, నా సైదోడు సుగ్రీవుఁ డనువాఁడు గలఁడు.

గం—[సకౌతుకంబుగ నాత్మగతంబుగ] ఆ ! కోఁతిజాతియందుఁ బుట్టినట్టి సుగ్రీవునిం దోఁబుట్టువని యెట్టు వ్యపదేశించుచున్నది. [విమర్శించి] వీ రిరువురికిం దండ్రి సూర్యుఁ డొకండే కదా. [ప్రకాశంబుగ,] అతని కేమి ?

య—ఆ యీతఁడు వాలి యని పేరొందిన బల్లిదుండైన పెద్దక్రోఁతిచేత నోడఁగొట్టఁబడినవాఁడై కొంత క్రోఁతిగుంపుతోడఁ గూడుకొని యొండు కొండనే యండగొని యున్నాఁడు.

గం—ఏమీ ? వీ రిరువురు సోదరులా ? అట్లయినఁ వీరి కిటువంటిది వైరమా ? అటుగాక కౌతుకమా ? ఏకామిషాభిలాషయే వైరశాఖికి మూల మని యిద్ది ప్రసిద్ధము. ఇందుచేఁ జాలు. రెండవకారణ మంతయుం దెలుపుము.

య—ఒకానొకనాఁడు తపసితనమును వైకొన్నవారు వలఱేఁడామనులవంటివా రిరువురు ప్రాయపువారు జడదారులును పున్నమచందురునిఁబోలిన నెమ్మొగమ్ముగల యొక కొమ్మయును నాకుఁ గేల్మోగిచి దక్షిణపుదరి దాటి పోవుటకుఁ గడఁగిరి.

గం—తరువాతఁ దరువాత.

య—అంతఁ గొంతసేపటికి నాపె కేలుదోయి గీలించి నన్నుఁగూర్చి యిట్లు విన్నవించెను. ఓ దేవీ ! ప్రొద్దుముద్దుగూఁతురా ! వెండియుం నీకుటుంబమునకు చూడ్కి మేలు గలిగింపు మని.

గం—అది నీ వెట్లు తలంచుచున్నావు ?

య—[గంగచెవిలో] నీ తెఱంగుననే.

గం—ఇది యూహింపఁగూడనిది. సుడివడువునఁ దిరుగుడువడిన మదిఁ గలదానవై

నిజముగా నిదే యేమొ లేనిదానినే యనుభవించితివి. [విమర్శించి] అటుగాదు దైవముయొక్క సంవిధానచాతుర్యము శివుఁ డెఱుఁగును ?

య—భూజనీయురాలవైన నీవు నదేమియు నెఱుఁగవా ?

గం—ఇది యనుపయుక్తము. బ్రహ్మలోకమునుండి వచ్చిన సరస్వతియొక్క వాక్యముల యందు కొన్ని నెమ్మనమ్మున నున్నదానను. అందువలన రమ్ము. తత్పట్టణవాస్తవ్యుడైన యేనిపలననేని వృత్తాంతమును విని నిరూపింతము. [అని పరిక్రమించు చున్నారు.]

ఇది మిశ్రవిష్కంభము.

---

సరయువు—[ప్రవేశించి] దేవులయిన మీకిరువురకు నమస్కారము.

ఇద్దఱు—అవిరళమంగళవు గమ్ము.

గం—[సరయువు చేయిపట్టుకొని,] యేలా ? యీలాగునఁ దాపమున మునిఁగియున్నావు ?

స—దేవీ ! ప్రతికూలాలాప మాడుచున్నావు. ఈశరీరసంతాపమేగదా, లజ్జాపంకమున మునిఁగియున్న నాకు నగ మవలంబనము గలది ?

గం—అదియంతయు స్పష్టముగాఁ జెప్పుము. ఎట్లు నీకర్ధావలంబనము ?

స—ఇప్పుడు గదా.

మాలిని. దశరథపురపౌరోదారకాంతాశ్రుధారల్
భృశగళితములందా షేద్ధము ల్మత్స్యపాళిక్
గుళము నుడుకఁజేయం గొంచుఁ బెంపొందుమేనే
ననురుసురనిసిగ్గో యంబకాంతుం ద్యజింతున్.

గం—[సాతంకంబుగ] మఱి వీరి బాష్పవృష్టికిం గారణ మేమి ?

స—[గంగచెవియందు నిటువలెనే]

గం—హా ! ఇందుమతీనందనా ! హా ! కోదండపండితా ! హా ! శతమఖసఖా ! హా ! అనేకమఖావబృధపవిత్రీకృతగాత్రా ! హా ! నిజతనుజనిర్విశేషపరిపాలితాశేషజనా ! హా ! రామచంద్రైకజీవితా !

స—[తనలో] వీనివలని విలాప మిది.

గం—హా ! మహారాజా ! దశరథా ! [అని మూర్ఛిల్లుచున్నది].

య—[పైఁటకొంగున వీచుచున్నది.] అక్కా ! ఊఱడిల్లు మూఱడిల్లుము. ఎల్లగోనము లచే వగచుటకుఁ దగినవాఁ డాతఁడు.

గం—[ఊఱడిల్లి] సఖీ ! సరయూ ! నీకొకతెకే కాదు. సర్వజనసాధారణముగదా యీ తాపము ? కావున రామచ్ఛత్రచ్ఛాయచేఁ బోఁగొట్టుకొందము.

స—[నిట్టూర్చి] అక్కా! ఎడబాటులేని నీటికలిమిగలిగియుఁ గమలకేదార మేరీతిఁ బరిశోష మొనయుచున్నది?

గం—వ్యక్తముగా నంతయుం జెప్పుము.

స—[మోవి యదరుట నటించుచున్నది].

గం—చాలుఁజాలు. దావానలపరిశోషితమైన మ్రానికొమ్మయందు గొడ్డలి వేయుటకు నిచ్చగించుచున్నావు. [విమర్శించి] అటు గాకున్న నంతయుం జెప్పుము. ఏమి వృత్తాంతము?

స—[తనలో]

ఆ. సుజనుఁడైనయట్టి స్వజనునియందుఁ గల్గినది బెడదదోసమును గనినని
తగ దెఱుంగనాడఁ దడవఁ జూడంగను, గలదె యింతకంటెఁ గష్టపాటు.

[ప్రకాశంబుగ] రామభద్రు నభిషేకించుటకుఁ గోరికి గలిగిన దశరథునిఁ జేరి మొదట నిట్టె వాకొన్నది కైకేయి.

ఆ. తనదు ప్రతిన తెలిపి తనరుట ప్రజఁ బరిపాలనం బొనర్చి వాసిఁగనుట
యనెడు నిదియె నృపుల కహహా! స్వర్గద్వార, మదియనర్గళముగ నగపడియెడి.

గం—[తనలో] ఇందు చేతనే యందాకం, దురాశచే నమంగళము సూచింపఁబడినది. [ప్రకాశముగ] తుద దేమి?

స—ఇది.

మ. మును నీవిచ్చినదౌ వరద్వయము నిష్టు న్నాకు నీరాముఁడే
వనవాసంబున కేగుతన్ భరతుఁడే పాలించుత న్భూమి నం
చనఁ గైకేయిదిమాట వించు జనకున్ వ్యగ్రాత్మునిన్ మ్రొక్కి వీ
డ్కొని సంతృప్తిని రాముఁ డేగెను మహాఘోరాటవీవాటికిన్.

గం—హా! రఘుకులకుటుంబకంచా! చెడితివి.

య—ఒక రఘువంగడమె గాదు. మఱి మొగములు తబసులు కాటివేల్పులుదక్కఁ దక్కిన జగమంతయు రాముమోము నెలచల్లనిచూపు లేమిని మిగుల వగవఁగఁ దగినది.

స—ఇది యిట్టే.

క. చలువలఱేఁ డరుగంగన్, విలాతికిం జుట్టఱికము నెట్టనఁ గనుటన్
గలువలె జిగిచెడవు జగం,బులుగా చీఁకటిని మునుఁగుఁ బోఁడిమిపీడన్.

గం—హా దశరథ! సకలగుణభాజనమవై యె ట్లీదైవముచే వంచితుఁడ వైతివి?

య—[సాభ్యసూయంబుగ] ఎవనిచే నటువంటికొడుకు గఱికపరకవలె విడువఁబడెనో, యటువంటివానిని మీ రేల వెండియుం గొండాడుచున్నారరు!

స—పాపము శాంతము. పాపము శాంతము.

శా. కైకేయీవచనంబులన్ దశరథక్ష్మాభర్త యొక్కింతసే
పే కాంచెం బహుమోహముం గ్రుధ నిరూపింపంగఁ జోరార్దితుం
డౌ కార్పణ్యధురంధరుండు కరగంబౌరత్నముంబోలె దూ
ర్వాకాండంబులఁబోలెఁ దావిడిచె హా ప్రాణంబులన్వెండియున్.

గం—మఱి యిప్పుడు రామచంద్రునియందు సీతాలక్ష్మణులవృత్తి యెటువంటిది?

స—నడు రేయి చందురునందుఁ జంద్రికాప్రసాదములది యెట్టిదియో యట్టిదే.

గం—[స్వ] రామునితోఁడఁగూడ వెలువడి రన నుడువఁబడుచున్నది. [ప్ర] సఖి! ఇంచుక సేదదేఱుచున్నాను. అంతవఱకు నీవచనామృతముచేత. క్షణమయినను రామచంద్ర వియోగము ననుభవించుటకు సైఁపనోపనిది మాజానకి.

స—ఇది యిట్లే. ఓసీ! సీతా! నాతల్లులను గొలుచుచుఁ గొన్నిదినములు గడపుము. ఇట్లని రామచంద్రునిచేఁ జెప్పఁబడినదియై జానకి మూర్ఛిల్లెను. ఎట్లనఁగా, బంధుజనులచేతఁ దేఁబడిన చల్లని నీటిబొట్లచేతఁ దడుపఁబడినదైనను దెప్పిరిల్లదయ్యె.

య—మఱెందుచేత మూర్ఛఁదేఱెను?

స—అమృతవాహిని. వనంబునకు నాతోడఁ, జనుదేరవె రామరో
యనునిరామువాక్యంబె, వినుతామృత మాటచేన్.

య—మఱి రామలక్ష్మణులకు నేమేని సమాలాపము జరిగెనా?

స—జరిగెను. రామునిచేఁ జెప్పఁబడినదిగదా!

ఆ. కడపుమీవు కన్నుగవ మూసికొంచును, గొన్నియేండ్లు బంధుసన్నిధాన
నన్నుఁబోలె శిలసన్నుతుభరతునిఁ గొలుచుచుండు మీవు గుణభరితుని.
లక్ష్మణునిచేతనుం జెప్పఁబడినది.

క. సీతోడఁగూడ నాకాఁ, బ్రీతిన్నాలుగుయుగములు వెస నలుజాముల్
సీతోడఁగూడకున్ననొ, యాతన్మన్వంతరంబు లన్నియె యేండ్లున్.

మఱియును.

క. నీసంగతి సుఖనగునా, కొపంవత్సరసమంబు లాకల్పంబుల్
నీసంగతిఁ గన కఱునా, కొ సమలేకల్పసమము లాలోచింపన్.

గం—మఱి కౌసల్యచే రామభద్రుఁ డేమైన శిక్షితుఁడయ్యెనా?

స—అయ్యెను. ఆమె, వత్స! రామభద్ర! జానకి నని యర్థోక్తి చెప్పఁగానే, కన్నీరను దగ్గుత్తికయుఁ గలది యగుచు నిట్లు చెప్పినది. జానకినిఁ జూచుటకే యిట్లు లుండ, లక్ష్మణుం జూచుటకు నీ వెట్టివాఁడవు? కాఁబట్టి యిదే నిన్నుఁ గోరుచున్నదానను.

క. అగుమీదుగ్ధముఖుఁడెదన్, సుగుణుఁడెదన్ లక్ష్మణుఁడెద సుదయుఁడ వరయం
దగు రాజ్యసుఖముకంటెన్, మిగులఁగనీవధికుఁడ వని మెలఁగెదు నిక్కఁడే.
రాముఁడు చెప్పెను ఓయమ్మా! నాకుం బ్రాణపదుఁడైన వీనియందునుం దక్షిణుండ
వవు మని శిక్షింపఁదగు.

గం—అదిమొదలుగ రామభద్రునకు సహజసౌందర్యమే యాభరణమా?

స—వేఱొకటిగూడ. రామభద్రుఁడు సర్వాభరణములను వదలుచు కౌసల్యచే నిట్లు
గోరఁబడియెను.

క. మైథిలిమంగళలక్ష్మికి, నాదటహస్తావలంబనార్థముగా నీ
శ్రీదమురతనపుటుంగర, మేదకు మోవత్స రామ హితమిది గనుమా.

[వెండియు సఖేదంబుగ] వేఱొండును నీకుఁ జెప్పెద ధీరురాలవగుచు వినుము.

గం—ఇంతవఱకు వినుచున్నదాననైన నన్ను నధీరురా లని యేల శంకించుచున్నావు?

స—చ. ప్రముదితవక్త్రశోభ కలరామునికిం జడలల్లె లక్ష్మణుం
డమరఁగ మల్లెమొగ్గ లన నగ్గలమైన నిజాశ్రుబిందులన్
క్రమమునఁ దడ్పి లోకమె భృశంబుగ శోకముఁ దాల్చునట్లుగా
సమయకచెల్ల యేమనుచు నాదట నాడెద పీడఁబోఁడుముల్.

య—తరువాతఁ దరువాత.

స—అంతట సప్రణయంబుగం బంధుజనులచే రామభద్రుం డిట్లు తెలుపంబడియె.

ఆ. సీత చాలబాల చిఱుతవారలు మీరు, దక్షిణంపుదిక్కు దైత్యనిలయ
మందువలనఁ జెపుదుమయ్య వత్సలతచేఁ, జనకు మీవవాచికి నిఁక రామ.

అంతటం దద్దిశంగూర్చియే.

క. పురజననయనార్పితమా, వరకువలయదామమూని వడిఁ జనె రాముం
డురుసురమురజద్విగుణిత, గురుగుణరవఘుష్టశార్ఙ్గకోదండుండై.

య—వెండియుం వేలుపుమద్దెలసద్దునకుఁ గత మెద్ది?

స—సఖీ! గంభీరముగా మ్రోయు సురమృదంగంబులచేత గంభీరమైన విషయమే
సూచింపఁబడుచున్నది.

య—చుట్టములచేత జానకి యేమైనను బోధింపఁబడినదా?

స—అమ్మా! తత్ప్రతీపమ్మిది.

క. వనవాసోత్కంఠుండగు, తనపతితోఁగూడఁ జనుచు ధరణీసుతయే
తనుమంజులమంజీర, స్వనమున బంధులకు దెలిపె సాధుచరితమున్.

ఇంతవఱకు జరిగెను.

చ. మనుజనునాథువెన్కఁ జోరిఁ బూనిక వేగముగాని యేగనా
జనకజయంత్రుఘ్నులం గిశలనత్ప్రవులం గనుబాంధవాత్ములన్
గొనబయి కాకరాలెఁ గడు గొప్పగ నశ్రులు శీతలోష్ణముల్
గనుబెనుమ్రుత్తియంబు లనఁగా నటు లేల ఘటిల్లెనో కనన్.

గం—హర్ష విషాదములవిలసిత మిది. [వెండియు సకౌతుకంబుగ] యుక్తము. అప్పుడు సుఖభోగమును సుమిత్రయుఁ జిన్నవాఁడైన లక్ష్మణునిచే నపేక్షింపఁబడలేదా ?

స—కోరఁబడినవే.

ఆ. పెద్దయన్నవెంటఁ బృథుశక్తిఁ జనువాని, కయ్యయోధ్య యయ్యె నడవి మఱియు
భోగమెల్ల రామభూమీశ్వరుండె సు,మిత్రసత్పవిత్ర ధాత్రిపుత్రి.

య—సులక్షణుఁడైన లక్ష్మణున కిది దగియున్నది.

గం—సఖీ ! కైకేయీవచన మిదే భరతునకు ననుమతమా ?

స—మేనమామయింటినుండివచ్చిన భరతునకుం గైకకును సమాలాపమే యిట స్ఫుటమయిన యుత్తరము.

య—మఱి యది యెట్టిది ?

శా. అమ్మా యెక్కడి కేగెఁ దండ్రి సుత యింద్రప్రస్థాని కేలా వియో
గమ్ముం గల్గఁగ నాత్మపుత్రు నిది పోఁగా నేల యాకం డర
ణ్యమ్ముంగూర్చి నృపోక్తి నాతఁ డెటు లన్యాయంబుగం బల్కె వా
క్యమ్మే బంధముగాఁగ నాడిఫలమే హా నీకు రాజ్యం బయో.

గం—మఱి యిప్పు డిక్కడ రాజ్యధరుఁ డెవ్వఁడు ?

స—క. కమలాలంకృతములు మణి, రమణీయంబులు నఖిలనరప్రణుతంబుల్
విమలములు రాజ్యధరములు,

గం—అ దేమి, (రాజ్యధరులు) భరతశత్రుఘ్నులా ?

స—పాపము శాంతము, పాపము శాంతము.

గం—మఱి యవి యెవి ?

స— క్రమముగ శ్రీరామపాదుకారత్నంబుల్.

గం—బిడ్డఁడా ! భరతుఁడా! స్వీయశీలసలిలముచేత సీతల్లియొక్కయు నకీర్తిపంకమును గడిగినవాఁడవు.

య—అంతట నంతట.

స—ఆటుపిమ్మటనో, తద్వృత్తాంత నిరూపణముకొఱకు నిజకమలవనవాసి కలహంసము నాచేతఁ బంపఁబడెను.

హంసము—[ప్రవేశించి] ఆర్యులారా! ఇదె నా ప్రణామము.

అందఱు, కోమలకంఠా! మంగళమందిరుఁడ వగుము.

గం—నాబిడ్డలయొక్క సంచార చరితములను మొదటినుండి తుదవఱకుఁ జెప్పుము.

హం—మ. తనువెన్నంటినవారలం బనుపడిన్ దామాన్చి విమ్మానల నాన్
మునుము శ్నైగ విరాగిసద్గుణుఁడు రాముం డొక్కఁ డొక్కమ్మడిన్
జనియెన్ సీతయుఁ దద్విభూతి యనఁగా సంతుష్టయై వెన్క వే
ద్కను బోయెన్ బిదప స్సుమిత్రసుతుఁడున్ గాఢప్రమోదాప్తి నాన్.

అంతటఁ బథికజనులచేత వత్సవర్గము ప్రణయమధురముగఁ జెప్పఁబడియెను.

చ. సికతిల మున్నమంబు నయి చెన్నలరారెను దారి మార్దవ
ప్రకటసుశాద్వలం బిలయు వాహిని ప్రబ్బలి గల్గి చల్లనై
నికటమునందు ముం దలరు నీరజినీకుముదిన్యపేతమై
వికటముసై మరాళరవవిభ్రమ మైనసరస్సు లెస్సగన్.

మఱియును,

ర. కనుఁగొను మిదె శీతచ్ఛాయంబున్ తరదురుమధుశీకరముకుటం
బు నిదియె యమితస్వచ్ఛ స్వల్పస్ఫురితలహరివాహినిబాగొఁ
బెనుపొందినయది వెండియుఁ దుష్మైపపిండు లులియవలపుల కిష్మే
యనఁ దామరతంపర గలదీకొల సహాహా తామరతంపరగాన్.

గం—ఆహా! తెరువునడక బడలిక నుడుపు నవి తెరువరులపలుకులు.

య—తరువాతఁ దరువాత.

హం—తర్వాతఁ బ్రాణనాథునివెనువెంట జానకి చనుచున్నది.

మ. హరిణంబుం గని భీతముం గురుదగూయత్తాత్మ యై తిన్నఁగా
హరిణాక్షీమణి సీత స్వాంశుకముచే నాత్మేశ్వ రేషాన్వసమున్
వరలీలాప్తి మఱుంగిడెన్ వరిమడిన్ స్వశ్రోత్రభూషాయిత
స్ఫురితం బౌ వరిమొల్కఁ గైకొని యిడెన్ సొంపొందఁగా నింపుగన్.

గం—ఈవిధమునఁ గనికరింపఁదగినది నాదుముద్దుబిడ్డ.

హం—ఇంకను,

మ. ప్రియమారంగ సరస్తటంబున నదీవ్యాప్తైకతంబందునుం
బ్రియు నొక్కింతయుఁ బాయఁజాలనిది యా శ్రీచక్రవాకాంగనం

దయివారం గని దారి వారక ప్రమోదంబుం గనెన్ రామన
ద్దయితారత్నము సీతయాత్మగుణయుక్తప్రీతియుక్తంబె కా.

గం—ఆతపతాప నాబిడ్డలనడపడులు, నడకబడలిక నుడుపునవియా ?

హం—మఱి ప్రయాణశ్రమ మెట్టిది ?

స—చ. అలఁతిగ నెండ యుండఁగనె యాఁ బయనం బదిరైన మెండుగా
నిలుకడ గల్గుచుండెడును నీరజబంధుని డాలు డీల్పడన్
వెలయుఁ బ్రయాణము న్మతి రవిం గన లేమిని గన్నుమూయఁగా
జలజిని పిడుపట్టుగను జక్కఁగ నెక్కొను టౌను సక్కడన్.

హం—నిచ్చలు నడచు తెరువరులకు నిది నియతము గాదు.

గం—[సాతంకంబుగ] జానకీసుకుమారావయవములు బీరెండ తాఁకుడుం గూడ నెట్టె
ఱుంగ కున్నవి !

హం—వెఱపు వలదు.

తే. ఎండ మెండైనఁ దాపంబు నెనయకుండు, మార్గమునయందు సీత తమాతనూజ
నల్లగల్వలదండఁ జాల్లను ల్వమీయు, రాము తెప్పార్పక యెం చూచు నామె గాన.

గం—[సహర్షంబుగ] సఖ సరయూ! ప్రియతమస్నేహ శీతల యయిన సీతయే కా దా?
చేత మనమును మనుచున్నాము.

స—ప్రోవఁబడుచున్నాము.

హం—మఱియును.

తే. నేల బీరెండ మెండుగఁ గాలుచుండఁ, గర్కశాంగుల కేనియుఁ గానిదారి
స్నేహసంభృతయౌటచే క్షితిజపతిప్రదాంకితత్స్థాతలము శీత మనుచుఁ దలఁచె.

య—ఓ తంద్రీ ! జగముచుట్టమా ! నీవంగడమువందును గనికరము లేని వాఁడవుగా [illegible]
చున్నావు.

స—ఓ దేవి ! క్షమా ! నీకూఁతునందును నిర్దయ వగుచున్నావు.

గం—ఈ యిరువుర యుపాలంభము చేఁ జాలు. స్నేహానుగుణప్రవృత్తులు మహాభూ-
వృత్తులుగావుగా ?

హం—శా. శ్రాంతశ్రాంతయు నయ్యు సీత పతికిన్ సంసేవ సేసెం దదుక్
వింత ల్దాఁగను వల్కలాంచలమున స్విన్నంగ వీచోపుగా
నంతన్ రాముఁడు విశ్రమాంబుముఖుఁడై యాజానకీతుష్టిచే
శ్రాంతశ్రాంతుఁడ యయ్యె వెండియుఁ బతిశ్రాంతిం గనం డేమియున్.

కం—అహో! వినయముయొక్క మనోజ్ఞత!

స—తరువాతఁ దర్వాత.

మాం—ఉ. చేరువ రాఁగ మన్కి మును జెచ్చెరఁ గొన్నియొ యజ్ఞ లేగి త
చ్చారుకరంబునుండి కొని చాపము డస్సినప్రాణకాంతునిక్
ధీరసహోదరాన్వితునిఁ విన్నగఁ గెంజిగురాకులం దగం
గా రహిఁ వీచు సీత విథవార్యసమంచితవై జయంతినాన్.

ఇదియుం జేమో సరసము నీకు విన్నవించుచున్నాను.

చ క్షితిసుతచేత వీవఁబడు కెంజిగురాకులచల్లగాలి త
త్క్షితిపతిపుత్రయుగ్మకము చెంపలఁ జెమ్మటఁ బాప నోపెఁ గా
ని తగఁ దదీయశోకభవనిర్గతనేత్రజలంబు మాన్ప దా
కతమున నద్ది సౌఖ్యజనకంబుగ నయ్యెను దుఃఖదంబె కా.

ఇంతియ కాదు.

శా. ప్రత్యావాసమునందు లక్ష్మణుఁడు సర్వస్తుత్యశుశ్రూషచే
సత్యంతంబు భజింప నింపుమెయిఁ ద్యక్తాయాసుఁ డౌ రాముఁ డా
సత్యస్థుం దని మేమబాష్పయుతవీక్షం గాంచ సౌమిత్రి త్య
క్తాత్యాయాసుఁడు శీతలాత్మకుఁడై యై కన్పట్టు నెప్పట్టునన్.

కం—రఘుకులీనులయొక్క సముచితప్రణయపేశలత చెప్పఁబడ నేల? బిడ్డలచేత రఘు రాష్ట్ర మెన్నిదినములు గడవ దాటఁబడెను.

మాం—రాఘవుల యాధిపత్య మెట్లెటుఁగనిదాన వవుచున్నావు?

శా. వీరగ్రాస్వరసావనప్రవరపృథ్వీపాలమాళ్యుజ్జ్వల
శ్రీరత్నస్ఫురదంశుమాంసలపదప్రేంఖన్నఖప్రాంకితుల్
దూరోన్ముక్తచతుస్సముద్రలహరీతోయోత్థశుక్తిస్థల
ద్రారాజద్వరముక్తిభూవలయముక్ దాల్తుర్ ధరామండలిన్.

ఉత్తరకోసలముల మూడు నాలుగు నాళ్లలో దాటిరి.

స—తరువాతఁ దర్వాత.

మాం—అంతటం ద్రిపురదమనమాళిమాలతీమాలిక మ్మందాకినిం ద్వారితంబుగఁ గళిందగిరి కరిప్రకాండగండమదధారోదారం గాళిందినిం దాటిరి.

కం—[జనాంతికముగ] సఖీ! కాళిందీ! నీవు నా కేది తెలిపితివో యది యిది.

స—విడవఁ బిడవ.

హం—అంతట, వ్యాధయూధ విదళిత వింధ్యాద్రి కుంభికుంభస్థల గళితములైన ముత్తెముల మొత్తములే మొగ్గలుగాఁ గల తీఁగలఁగల కాఱడవులే వలువలుగాఁ గలిగిన నర్మదను దాటి, చంచలకర్ణాంచల సురభిళ శుండాల గండ చలిత సహచర సమాగమము వలన సమ్మోద మ్మెసఁగిన యాఁడుదుమ్మెదల యుల్లసమ్మయిన ఝుంకారమ్ముచే రమ్యమైన గోదావరీసవిధమునకుఁ జనిరి.

య—అగొన్యా! అయ్యో! అయ్యోఁగద, లంకయొడయుని చెల్లెలు క్రొవ్వినది చుప్పనాతి యను నొక్కరక్కసి చెరలాడుచున్నది.

హం—మిక్కిలి క్రొవ్విన దని వక్కాణింపనగు. ఇపుడుగదా యది లక్ష్మణకౌక్షేయకమ్ముచేఁ గోయఁబడిన తనముక్కుయొక్క నల్ల యను కల్లు నానినది.

య—[సహర్షంబుగ] దాని సాహసమునకు నిది దగినదే.

గం—[స్వ] ఇది యేదో యనర్థాంకురము గాఁదగినది. [ప్ర.] దానిని విని జనస్థాననివాసులైన రాక్షసులసమూహ మేమి సేసెను?

హం—కత్తుల విండ్లం గైకొని రామభద్రుని కభిముఖముగఁ గదలెను.

గం—[స్వ.] పిమ్మటఁ బిమ్మట.

హం—అటుపిమ్మట, సౌమిత్రిచే రామభద్రుఁడు విన్నవింపఁబడెను. ఆర్యా!

క. రక్కసుచెలియలి మెత్తని, ముక్కుఁ దఱిగి నల్లయందు మునిఁగి పదునులో
మిక్కిలి మెఱసెడు నాయది, యుక్కుత్తి నిశాటఘాటహింసకుఁ దివురున్.

రామభద్రునిచేఁ జెప్పఁబడెను. వత్సా! అబలాజనము ప్రకృతిభీరువుగదా! అందుచేత సీతతోఁగూడిన పర్ణశాలనే నీవు కత్తిసెత్తికొని కాపాడుచుండుము. "నేను శత్రుముగా," అని యర్థోక్తియుండే, మానవాదసమూహమ్ము సమ్ముఖమ్ముగఁ జనుదెంచెను.

క. అంతట ముహూర్తమాత్రన, నంతయుఁ జయలీలచే రహిం బిల్వఁబడెఁ
గాంతుఁడు లక్ష్మణుఁడు,

స—[సహర్షంబుగ] రామభద్రునిచేతనా?

హం—కాదు కాదు.

స—భగవతి భాగీరథీ! నన్నుఁ గాపాడు కాపాడుము. రాక్షససమూహము చేననిచెప్పునో?

హం— అరితతి, గంతుకొనఁగ నులియుఁరామకార్ముకమణిచేన్.

గం—ప్రథమక్షణమున నగపటుపఁబడిన బీరెండగల దిది యమృతవృష్టి గాదు.

య—తర్వాతఁ దర్వాత.

హం—అంతట సంతుష్టులైన సంయములచేఁ బలుకఁబడిన సాధువాదములను విను వినోదముచేఁ గొన్నాళ్లు గడచెను.

చ. పరకురువిందనేత్రము ప్రవాళవిషాణము మౌక్తికోల్లస
ద్గురుతరచిత్రమండనము కోమలహాటకకాయమై యహో
హారిణము గల్గె నొండడవి నంతట భూరిమనోహరంబు సం
చరదమరాగమోయనఁగ జంగమరోహణశైలమో యనన్.

గం—తరువాతఁ దరువాత.

హం—తర్వాత.

తే. భ్రూజితాసమశరచాపము గన జాప, విజితయువతీవరభ్రూసువిభ్రమముగ
సీతకడకంటిచూడ్కిఁ దాఁ జేరి దాని, రాముఁడుచు నసితోత్పలశ్యాముఁడు మఱి.

గం—తర్వాతఁ దర్వాత.

హం—శా. భీతార్తం బయి యార్చు నామృగముతో వేగంబె యేగంగ శ్రీ
సీతాకాంతదిస్వాంతమాతురతతో శ్రీలక్ష్మణుండుం ధను
ష్స్ఫీతుండై చని యొం దదాశ్రమము రక్షింపంగ నందుండఁగ
ప్రీతిం బ్రీతిని వచ్చె నచ్చటికి హా భిక్షుం డొకం డెవ్వఁడో.

గం—[తనలో] అందువలన నిది యనర్ఘనాటకమునకుఁ బూర్వరంగకల్పనమువలె నని
భావించుచున్నాను. [ప్ర] అంత నంత.

హం—అంత.

ఉ. అకడ రాముఁ డుజ్ఝితదయన్ హరిణాంగమునందు బాణమున్
వీఁకను వేసె లక్ష్మణుఁడు వేగమె వచ్చె సధర్ముఁ డన్నపైఁ
బ్రాకటభక్తి సీత యిడెభైక్షము భిక్షువుకేల లీల నే
నాకసమందునుండి యొకయప్పుడె కంటిని దీని నంతయున్.

స—[ఔత్సుక్యమును వ్యక్తీకరించుచున్నది.] అంతట నంతట.

హం—మఱియు నేను,

చ. కనకమృగంబుగాత్రమున గ్రద్దరిమ ల్కడిపాటుఁ గాంచుటన్
గనికర మొందుడెందమునఁ గానఁగనేరక చూపుఁ ద్రిప్పికొం
చును నిలివృత్తము న్నృపతిసోమునివృత్తము నీకుఁ దెల్ప గొ
బ్బున నిటసీతటి న్దిగితిఁ బుణ్యదయోసరయూసరస్వతీ.

కావున మీరు ఈ దివ్యవారియందు వాల నాకనుజ్ఞ నిండు. అలసినదానను.

గం—క. తిరముగ నలరుము శుచిజల, మరవిందవికాసముగలయంచితసరసిన్
బురతరుణీచరణరణ, ద్వరనూపురకూజితోత్కటన్ హంసకమా.

హం—[నమస్కరించి నిష్క్రమించెను.]

స—భాగీరథీ! ఈ నూపురోద్దేశముచేఁ జెప్పఁబడిన వృత్తాంతముచేత దానిచే మఱవఁ బడిన దేమో యొకటి నాచేతఁ దలఁపఁబడుచున్నది.

గం—అది యెటువంటిది?

స—ఏటువంటి దనఁగా, అడవికి వెడలునపుడు, పతివ్రతాశిరోమణియైన యరుంధతి యందెలజోడు చేతఁ బట్టుకొని పుత్రమిట్టిరో సాదరంబుగ నీమాటఁ జెప్పెను.

చ హరిణదృగంగనామణి యనుంధితము ల్గన యిచ్చె దండియల్
వరకమణిమండితంబులు వలన్మృదుస్వనము ల్ధరింపుమీ
విరహముఁ గాంచ రష్టుఁ బతిప్రీతికిఁ బాత్రము కాదు రింతులీ
స్ఫురదురునూపురప్రవరము ల్ధరియించిన పీనిశక్తిచేన్.

సీత, ఆరీతినే చేసినది.

గం—బ్రతికితిని. నాయనుంగుఁజెలికత్తె వసిష్ఠసహధర్మిణి సత్యవాదిని. కాఁబట్టి యీ వృత్తాంతమంతయును రఘుకులవత్సలుఁడైన సాగరునకు విన్నవింపఁబోదము. [అని పరిక్రమించుచున్నారు.]

గం—[సవిస్మయంబుగ] ఓసీ! ప్రవాహజవాతిశయముచేతఁ, దూరముగఁ జెచ్చెర వచ్చినాము. ఇఁదుగో గోదావరిసహచరుం డగుచు సాగరుం డేమో మాటాడుచున్నాఁడు మనము వేలాతమాలకుమాటుననుండి తద్వృత్తాంతము నాలకింతము.

[అంతట, గోదావరీసాగరులు ప్రవేశించుచున్నారు.]

సాగరుఁడు—తరువాతఁ దరువాత.

స—తద్వృత్తాంత మిటను నేల చెప్పఁబడుచున్నది?

య—అంచచేతఁ దెలుపఁబడనియది యెదో యదే యగుఁ గాఁబోలు.

గో—శా. రామాస్మత్తశరప్రభిన్నతనునిర్యద్రక్తసంసిక్తమై
హేమాంగం బగునాకు రంగ మపు డారయ న్నోఁకుమారీచుఁడే
యామస్కార్యథముండు రావణుఁడుగా నయ్యెం దశాస్యుండు సు
శ్రీమత్కుండలమండితుండును మదోద్రేకాతిరేకుండు నై.

గం—హా! హతలమైతిమి. [విమర్శించి,] ఐన నేమి? అందెలదోయి గలదు.

సా—[ససంభ్రమంబుగ] అంతవఱకు మాచిన్నది నిశాచరునిచేతఁ దాఁకఁబడకున్నదా?

గో—అట్లేకదా!

చ. దనుజునికేలు దాఁకమికిఁ దా ననసూయయొసంగినట్టి స
ద్వినుతశరాంగరాగమున వెల్వడి వెల్గాకఁడంటరాని వే

ల్పనఁగ వెలుంగుచుం గువలయచ్ఛదశీతముగా నయై తనం
తనె వెస సీతఁ గ్రమ్మెను ఘనమ్ము దటిత్తు ననంగ నత్తఱిన్.

సా—[సహర్షంబుగ] అంత నంత.

గో—అంతట, వరుణమంత్రచింతనముచేత సమానీతమైన నూతన జలదశకలముచే నిచోళితహస్తుం డగుచు నంటకయే,

శా. హా నాథా రఘునాథ సాధుజనరక్షా దుష్టసంశిక్షకా
ప్రాణేశా జగదేకవీర కరుణాపాథోధి శ్రీరామ నీ
దాని న్నన్ను నుపేక్ష సేయఁదగునే ధర్మజ్ఞ యంచుం బోరిం
దీనత్వంబునఁ బల్కుసీతఁ గొని పఙ్క్తిగ్రీవుఁ డేగె న్దివిన్.

స—[సవిషాదంబుగ] భాగీరథీ! మనయభాగ్యమువలన నరుంధతివాక్కులు గూడ మృషగాఁ గలవు.

గం—కావు కావు.

సా—[సవిషాదంబుగ] అంత నంత.

గో—అంత నత్యంతోన్నత శిఖరి శిఖరనిశాంతుఁడును, శకుంతరాజును నగు జటాయువు దారి నడ్డగించి సాటోపంబుగ దశాస్యు నుద్దేశించి యిట్లు వచించెను.

శా. ఓరీ పాపుఁడ నేఁ గనుంగొనఁగ రామోర్వీశరామన్ హరిం
తేరా చౌర్యముచే గిరీశ్వరశిరస్థేందూల్లసద్రేఖ నా
ఘోరాస్త్రన్నఖరాళి సీతలల నేఁ గ్రోధోద్ధతిం ద్రుంచి ని
స్నేరా చంపెదఁ దత్సుపర్ణుఁ డమృతాస్వీతోరగంబుం బలెన్.

గం—ఇది నూపురప్రభావము.

సా—[సహర్షంబుగ] పిమ్మటఁ బిమ్మట.

గో—తే. అజ్జటాయువుతన్నుల నంతరావణునకు రక్తసిక్తంబయి తనువు వ్రిదిలె
రథము హేమాభరణము ధరాసుతాప్తి, జనితవితతమనోరథము గ్రమమున.

సా—అంతట నంతట.

గో—అంతట, నిశితనఖనిస్త్రింశనిపాతభీకరమైన సమరసంరంభంబున విజృంభమాణుండగు రావణునియొక్క యొక్కకేల సంభ్రమాకులయై యున్న యాకెది.

తే. క్షణము లేదుగదా జనకజదియండె
క్రందనము సేయుచు నిలఁ బడెఁ గరుణముగను

గం—అయ్యో! ఇపు డపనీతాశుల మైతిమి,

గో— నిలునిలుము చచ్చితివి నీవు ఖలయను మతు
ఖడ్గహతుఁడై జటాయువుఁ క్షమను బడియె.

సా— హా! బిడ్డా! సీతా! ఇప్పుడు దానవుని చేఁ గొనిపోఁబడుచున్న దానవా? [అని, మూర్ఛిల్లుచున్నాఁడు].

గం— [చెచ్చెర వచ్చి వీచీపటాంచలము చే వీచుచు] దేవా! ఊరడిల్లు మూరడిల్లుము.

సా— [ఊరడిల్లి,] ఎట్టికడం గంగయుం గాళిందియు నరయుందురు? అందువలన నన్నుం దఱుం బట్టుకొనుండు. వంతవఱపచే నేను గొట్టుకొనిపోవుచున్నాను.

గం— భయంపడ నేల?

తే. సంపదలును దురాత్ముల కింపునిడవు, తుదకు నాపదల కై యిడి తొలఁగుఁ గాన
నాపదలును మహాత్ముల కడలు నిడవు, తుదకు సంపద లిడుటచే నిది తగుఁగద.

సా— గోదావరీ! రామభద్రు నివృత్తాంత మెటువంటిది?

గో— రామభద్రుఁడో,

వసంతతిలక. హాతన్వి హావిధుసమాననయంచు దుఃఖా
వేతుండనై పలుకు చేడుపు దోఁచ సౌమి
త్రీ తుండెడైయెడక యే వెదలంగ సెట్టా
నీ తేఁకుఁ డేఁగెఁ గలశీసుతదిఙ్ముఖుండై.

స— సఖి గోదావరీ! ఆ నూపురముయొక్క వృత్తాంతము నెఱుఁగుదువా?

గో— దానిని దీసికొని యేదో యొకకోఁతి ఋశ్యమూకపర్వతాభిముఖముగ నరిగిన దని వనదేవతాముఖమున నేను వింటిని. [నేపథ్యమందు,] సఖి కాళిందీ! వర్ధిల్లుచున్నావు.

య— మఱి యిట్లు నూచీశలాకాశల్యక్షతములైన నాగోళ్లను లత్తుకరసముచేఁ దడుపుచున్నవా రెవరు?

తుంగభద్ర— [ప్రవేశించి, విలోకించి,] కాంతాజనపరివృతుఁ డగుచు సాగరుఁ డిట నెటు లున్నాఁడు? [ముందఱికి వచ్చి,] దేవుఁడు సర్వోత్కృష్టుఁ డవుత.

సా— తుంగభద్రా! కాళిందీవర్ధనము నంతయుం జెప్పుము చెప్పుము.

తుం— సోదరుఁడైన సుగ్రీవునియొక్క వానరరాజ్యలాభము చేత.

య— ఇపుడు బీరెండతోడను, గందముతోడను గూడుకొన్న రెండు ప్రక్కలు గలదాన నగుచున్నాను.

సా— వాలిచేఁ బాలింపఁబడు రాజ్యలక్ష్మి యెట్లు సుగ్రీవునిఁ బొందెను?

తుం— ఏల వాలికథ యిప్పుడు? సీతాపదగళితముఖర రత్ననూపురప్రదానమ్మున నమ్మిక

నెమ్మది రామభద్రుం డుండ, భక్తుఁడైన తనుక్ సుగ్రీవునిని సమర్పించిన హాను మంతుఁ డప్పగిది యత్నించెను. ఎట్లన, ఆయత్నమువలన

శా. లీలామాత్రముచే వధించి మును వాలిన్ పైఁడిలేడింబలెన్
శ్రీరాముండు వలీముఖేశపదవిం జెందించి సుగ్రీవునిన్
తారత్వంబున మిత్రశత్రు నతిమాను న్నాకమొందించె స
ద్ధీగత్వంబున నాత్మగోత్రపతి నందించెన్ హరి న్స్తోమమున్.

సా.—అంత సుగ్రీవుఁడు ప్రత్యుపకార మేమి సేసెను ?

కుం.—అంత నతఁడును.

చ. వసుమతి కంది కుంది కడువాడినచంపకమాలపోలెఁ బో
ల్పెసఁగక యుండుసీతను మహి స్వదకుం డెటనేని మాన కం
చు సముచితాధ్వముం దెలిపి కారుల నీలనలాంగదాదులన్
వెసఁ జనుదేరఁ డంచుఁ బనిచెన్ హనుమన్ముఖు లేగి రాకపుల్.

సా.—ఇపుడు బ్రదికితిని.

గో.—ఈ వొకఁడవా? ఈసకలలోకమును.

సా.—ఇది యట్లే. సకలజన కుముదానందకరుఁడుగదా, రామచంద్రుఁడు. ఇందే యంతయుం దిలకింపుము.

ఉ. ఉండెడు నీభగీరథజయు ప్రవిణాసరయూసరిద్వరల్
మెండగుకూర్మిఁగూడుకొని మిక్కిలి న న్నలరించువారు వీ
రొండవె నేను సాగరుఁడ యుక్తముగా రఘువంశపక్షమే
యుండినమాకు రామునిశుభోదయభావ మెసంగు టబ్రమే.

[మీఁదు సూచి, సాశ్చర్యంబుగ,]

మ. పవిధారాదితపక్షము ల్గద గిరుల్ భావింపఁగా నన్నియున్
భువి మైనాకుఁ డొకండు నాపయసునన్ బో మన్గియుండుం గదా
యెవఁడో వీఁ డిట నన్ను దాఁటెడుఁ గరం బేపారి గర్వాంగుఁడై
యివపుంగొండయొ వింజపున్మలయొ యూహింపంగ రాదేమియున్.

కావున వీఁ డెవఁడో యంతయు నిరూపింతము రండు [అని, యందఱున్నిష్క్రమించు చున్నారు.

ఇది, పంచమాంకము.

# ఆంధ్ర ప్రసన్నరాఘవ నాటకము

## షష్ఠాంకము.

[అంతట, రామలక్ష్మణులు ప్రవేశించుచున్నారు.]

రాముఁడు—శా. సౌమిత్రీ ద్రుతలంబు నీరవలయుం జండాంశుఁ డేచుం గదున్

లక్ష్మణుఁడు— రామా రాతిరిప్రొద్దు సుద్దియెది రేరా జీతఁడే రాజిలున్

రా— సోముం డీతఁ డటంచు నెట్లెఱిఁగితో?

ల—[సప్రత్యభిజ్ఞంబుగ] చూపట్టుటం జింక యిందు,

రా—[సానుస్మరణంబుగ, సకరుణంబుగ,]

ఓ మత్ప్రేయసి! హా మృగాక్షి! యెట నుందో స్థ్రామ్ముఖి! జానకీ.

[వెండియు నవలోకించి,] అయ్యో! అళీకసంతాపముచేత మోసపోతిని. ఆకాశముపైకి నెక్కుచున్న రోహిణీహృదయచందనుఁడు చంద్రుఁడా పీఁడు? [చందురుం దిలకించి,]

చ. అమృతకరుండ నీకరము లారయఁ గైరవబాంధవంబులౌ

నమరెను జాగరూకములె యై భువనాళివిశిష్టచేష్టలన్

సమమతిఁ జెప్పవేల యది శ్యామ మదీయ వసించు నెక్కడన్

[విమర్శించి]నమృగుఁడ వౌదు పీ వికఁ నిశాచరుఁ డౌదువు చందమామవే.

ల—[తనలో] కట్టా! వనటయల యెట్లిమానసీయనిమానసంబునుం బొరలించుచున్నది? అటులవుటవలన, వేఱువిషయముమీఁదికి నరుగఁ జేయుదును [ప్రకాశంబుగ] అన్నా! ఇటఁ గాంచుము. ఇదె, చంచలచంచూపుటముచేఁ ద్రావఁబడుచున్న యమృతకరకర నికరము గలది, వెన్నెల పులుఁగు.

రా—[విలోకించి]

మ. మును నీచేడియతోడఁ గూడుకొని సోము న్గాని యేదానిచ

క్కనిచెక్కిళ్లదిడాలు గ్రోలితివి వేడ్కం జూడ్కికిం బండువై

తనరంగా నలసీతనెమ్మొగముఁ జెంతన్నాకుఁ గాన్పించి ధ

న్యునిఁజేయంగదె నన్ను నన్నద్విజమాజ్యోత్స్నప్రియోత్తంసమా.

ల—అన్నా! ఈకడ నాలోకింపుము. ఇదే శరత్కృశయు, సుధాకరకరకరంబిత తరంగయు నగు తరంగిణి.

రా—[కనుంగొని,]

క. కల్లోలిని నీవలెనె, యల్లలన. కురంగనయనయందుం గృశతన్
సల్లలితవు సమాజసుశీ,తోల్లసితవు సీత దాఁప మొందు న్మతియున్.

ల—ఇక్కడఁ జూడుము. సగము విచ్చిన నల్లగలువ మొగ్గవడువు నడఁగియున్న దిదిగో గండుఁదుమ్మెద.

రా—[చూచి.]

మ. వికసల్లోచనరోచిరాశిలహరీపీతంబు లామోదమా
త్రకము ల్గాఁదగుకర్ణపూరముల సాక్షన్నిల్పి కించి ద్రుతిన్
బ్రకటింతీవుగదా మదంగనకు మిత్రత్వంబు సంధించి యా
యకమో మెందుఁ గనఁదగుం దెలుపుమయ్యా యన్న పుష్పంధయా.

ల—[తనలో] అన్న యిందాఁకం దీని నాలోకింప కున్నాఁడా?

రా—తమ్ముఁడా! ఇది యెట్టి పిట్ట!

క. ఇది కుంకుమరుచి వెలుపలఁ, బొదలించును గాంచి లోనఁ బొరిరాగంబున్
నదితటమున నేడ్చెడు తన, ముదితను గనుఁ గాని కదియ మోఁయదు కరుణన్.

[నిరూపించి] అగుఁగద, యిది సహచరీ విరహవిదారిత హృదయము. వరాకము చక్రవాకము. [నిశ్శ్వసించి] ఇది యొకఁడే తుల్యదుఃఖము చేత నాకున్సమానశీలము. కాని చో నాకును దీనికిని సమానశీలత యేలాగున నగు?

ఉ. ఈయది చక్ర మిందు వుదయింపఁగనుం బ్రియవిప్రయోగమున్
జాయ మగండు రా మఱియుం సంగమసౌఖ్యముఁ బొందుఁ బొందుగన్
జాయను బాసి గాసిపడు నాకన నెన్నొకొ యయ్యో నయ్యయో
యోయనదుఃఖదంబులు విధూష్ణకరోదయముల్ క్రమంబుగన్.

ల—అన్నా! ఈకడ నాలోకింపుము. ముకుళిత నళినీపరిసరానుసారి కలహంసకము.

రా—[కని] కనికరమున,

మ. గిలిగింత ల్పచరించి నన్నఖములం గీలించినం గోరకం
బులు రోజంబులు బాగఱన్ మధుకరంబు ల్పాడమిం బద్మినిం
గరుణాహీనని శేసపాదహాలి భంగస్మూర్ఛితాంగం గటా
కలహంసంబు గనుంగొనుం బలుమఱున్ గ్లాంతంబు క్లాంతంబునై.

[విమర్శించి, వెండియుం సవిషాదంబుగ] ఇటువంటివానికె సహచరీజనానుకంపా కోమలము మానసము మేలు. స్వభావకఠినుఁడైన రామునికో కాదు.

ల—[తనలో,] ఎట్టిప్పుడును, అన్న మనమున జానకీమయ మింద్రజాలమున్మీలించుచున్నదిగో!

[తెరలో,] సఖా! రత్నశేఖరా! చిరకాలమున కగపడితివి.

ల—[ఆకర్ణించి,] ఇదియేమి? [మఱియుం దెరలో] చెలికాఁడా! చంపకాపీడా! ఇది యి
నేనింతకాలమువఱకు నఖిలమాయానిధియు, మాయావిదులలో నగ్రేసరుండును
మయుఁడను దానవునియొక్క కూఁతురును, తనతోఁ దోఁబుట్టువు, నగు నామె న
రించుటకు లంకయందు నునికిఁగొనియున్న చిత్రరూపుఁడను దానవునివలన,
మయిన యింద్రజాలపటలనఁ దెలిసికొనుచుంటిని.

ల—అవు నది యెవరో యిద్దరు విద్యాధరుల సంవాదము.

[తెరలో] సఖా! రత్నశేఖరా! ఆహా! ఐన నదియేమో, నిజకళాదర్శనమును గావింప

[తెరలో] చెలికాఁడా! చంపకాపీడా!

క. నరులకు సురాసురులకుం, గరుడోరగసిద్ధసాధ్యగంధర్వులకున్
గర మరిది యైనచిత్రము, పెరవారిఁగఁ జూపు మెవనివృత్త మొనరెడున్.

అటుగానియెడ, వేఱేల? లంకననుసరించినదే యేదేని నవీనమును, సరసరమణీయ
మైన చరిత్రమును నీకుఁ గనఁబఱిచెద.

ల—అన్నా! ఇక్కడ నిడఁబడు నీయది యయత్నోపనీతము ప్రేక్షణీయము ప్రేక్షణిక

రా—వినకయే.

గీ. నీ నూపురతపపుటం జెలన్నినదము విని, కలఁగి కలహంస కులము కలకలము సేయ
లక్ష్మణపదాబ్జములజాడ లలితగతులు గౌతమీసైకతములను గనుము సీత.

ల—అన్నా! ఎక్కడ? మఱి యిక్కడ గోదావరియుఁ వైదేహియు?

రా—ఎట్లు ప్రతారితుఁడనైతి మతిభ్రమముచేత? కానేని, కృతార్థీకృతుఁడ నైన
దీనిచేఁగదా?

ఆ. సీత లక్ష్మణుండు గౌతమీతీరతపోవనములఁ బార్శ్వములను బరఁగఁ
గడపినాఁడ నిమిషకలన నెయ్యావి యట్టిదినము, లింక ముందు నొనరుపడెడు.

[మఱి ప్రత్యాశతోను,] కానీ!

క. ఇది వేనితోడఁ జూపెన్, ముదమున గోదావరియల మొత్తములసిరుల్
ముదితవియువి వచనసుధల్, గుదురుగఁ జెవి చేరలఁ జవిఁగొందునొ మఱలన్.

[తెరలో]

క. గోదావరి యో సొబగుఁడ, తాఁ దాల్పుం జేతను వెలిదామరగొడుగున్
ప్రోడిగనల వెలిసీవురు, నేదకయే పీచు నీకు నిది యరుదుగదా.

రా—[సహర్షంబుగ] ఆహా! అదే యిది, ప్రియసీసమాలాపము. అలాగుననే.

చ. పరిమిత మాట హృద్యమగువాగ్విభవంబో సుకోమలంబయా
సరసము మాధురీధురిఁ బ్రశంసిత మింకను నేమనం జనున్
స్వరమన వీణియం దనరుపంచమనుం బురణించు దీనికిన్
వరకలకంఠకంఠరుతి వన్నెడెనున్ శ్రుతివాదభూమియై.

[విలోకించి] ప్రియురాలు మతి యెక్కడ? ఎట్లిది యదృష్టచంద్రరేఖను చంద్రాతపము? [అంతట వర్ణింపఁబడఁగలప్రకారముగా జానకి ప్రవేశించుచున్నది.]

రా—[సావేగంబుగ] ప్రేయసీ! ఎట్లిప్పటి కిప్పటికి వచ్చితివి? [అని. కౌఁగిలింపఁ గోరుచున్నాఁడు.]

ల—అన్నా! ఏమిది యింద్రజాలమును నిన్నుం గలంచుచున్నది.

రా—[నిర్వర్ణించి,] ఆహా! ఏమిది సన్నివేశవిశేషము! ఎట్లన్న

మ. ఒకకేలం గయిసోఁబడెం దగ నశోకోర్వీజసచ్ఛాఖ వే
రొకకేలం దినచంద్రమస్సరుచి యయ్యుం జెంప దుంబొందెడున్
సుకచంబున్ లులితంబునై పిఱుఁదుపై సొంపేదెడుం బొర్లుచున్
బ్రకటంబౌఁగద పత్త్రలేఖవిగళద్బాష్పోస్ఫురత్పుష్పాప్లుతమై.

[వెండియుం విభావించి,] తగు నిది యశోకశాఖను సఖివింబోలె నవలంబించి నిదురఁ బొంకినది. దీనికా?

చ. వికసితనీలనీరజసుగంధిభ్రమహం గనఁ గన్నుదోయి ప్రా
యికసుకోమలాంగము వహించు నహా శిథిలత్వ మింతయేన్

[వెండియు విమర్శించి,] తగు నిది మనస్సంతోషమునకు, స్వప్నమందుం దీనిచే నెవఁడో చూడఁబడినాఁడు. ఐన, దీనికి,

ఇఁకఁ బలుకం గడంగనవు డెన్నఁ బ్రవాళసుశోభఁ జెన్నగున్
బ్రకటముగా ముదశ్రుకణవారము మౌక్తికరాశి నాఁ దగున్.

సీత—[కనులు దెఱచి] అయ్యో! ఏమి! ప్రాణిలోకము వేఱువిధముగా నున్నది! గోదావరిజక్కర యెక్కడ? ఎక్కడ నల్లగలువవలెఁ జామనిచాయవాఁడు రాముఁడు! లంకాపురి యెక్కడ? ఎక్కడ రాముఁడే మనుగడగాఁగల సీత? [అని మూర్ఛిల్లిపడుచున్నది.]

రా—[భూమినిఁ గూర్చి,]

ఉ. దేనిని దాల్చి గర్భమున దివ్యసతీమణిరత్నగర్భ నాఁ
గా నుతవైతి సార్థకముగాఁగను గాంచితి నామధేయమా
మానినిసీత నీపయిఁ గ్లమంబునఁ బొర్లఁగఁ గాంచి యుంచు కే
మానుకవేల ధాత్రి మలిమాలితొ సర్వసహాఖ్య నీవె కా.

కావున దీనిఁ దేర్ప నిన్నే బ్రార్థించుచున్నాను. [విమర్శించి] కానిచో నీప్రార్థన కేమి ?

క. తనకూఁతురైనసీతకొ, జనవుమెయిన్ సేవఁదేర్ప సమకట్టవిదా
ఘనకరిన ప్రకృతికయో, తనదుబిడ్డయందు నేని దయ యెటు లొదవున్.

అటు లవుటవలన దీనిని యభ్యర్థించుచున్నాను. [అశోకశాఖంగూర్చి]

మ. చెలి గాఁడై వయిశోకమా నిజసఖన్ శీఘ్రంబు గాఁ దేర్పు మి
ల్లలనం బల్లవహ స్తకిసలయము లల్లాజల్లుచుం జల్లఁగన్
వెలయంగం దనకంటెనిటికి నిది మున్నే పాదునం బోసి ని
న్నలరించెంగద ప్రత్యహంబును దయాయత్తైకచిత్తంబునన్.

[సవిషాదంబుగ,] ఏమి వినిపించుకొనకయే నిరాకరించినది యిది అహో! పలాశకకృతఘ్నత. [చింతించి,] సఖి! జానకీ! ఊఱడిల్లు మూఱడిల్లుము.

సీత—[ఊఱడిల్లి,] ఎట్లు నాయొక్క నేస్తకత్తె త్రిజట యిక్కడ నున్నది?

త్రి—చెలీ! ఆకాలమనోహరమయిన యీ నీముఖరేఖచే నూహించుచున్నాను మనోజ్ఞమైనదాని దేనినో చూచినదాన వని.

సీత—చెలీ! ఇది యిట్లే. నే నిప్పుడు కలలో గోదావరిచే కేలఁ గైకొనఁబడిన యలతుంఘునసీపుంచేసను, తెల్లదామరయెల్లిచేతను, గొలువఁబడు నామగనిఁ గనుఁగొంటిని.

త్రి—[సహర్షంబుగ] సఖి! వర్ధిల్లెదవు. సుస్వప్నముగద యిది ?

సీ—[నిట్టూర్చి] చెలీ! అతనియందే యుంచుఁబడిన వగపు గలదాననైన నాకుఁ గలయందు నమ్మిక యెటువంటిది?

త్రి—చెప్పుము ఎట్లు చింతాస్వప్న మని యెన్నుచున్నావు?

సీ—అట్లే.

త్రి—కాదు కాదు. అచుంబితముగదా యిది.

సీ—మఱి యేమి యలవడనిది ?

త్రి—ఏది తలఁపఁబడనిదో !

సీ—ఏది తలఁపఁబడనిదో, అదియుం నీజగమునఁ గలదుగదా ? రాము మోముచందురుం జూడనిదగుచును జనకునికూఁతురు మనుచున్నది. అందువల్ల నేల యీ నా యుసుఱు నా పెనిమిటిచే నొప్పరికింపఁబడినదానను.

రా—ప్రియురాలా! నాచిత్తమందు నున్నదాన వయ్యెను, ఎత్తెఱఁగున నాచిత్త మెఱుఁగని దాన వవుచున్నావు?

సీ—కాకున్నఁ, బేమని చేసికంటి బొమిడికపుఁ జందమామయందుఁ గందు కెలకొలు
పుదు? ఇప్పటికిని నా పెనిమిటి నా జాడ నెఱుఁగకున్నాఁ డని తలఁచుచున్నాను.

రా—ప్రియురాలా! ఇపుడు బాగుగ నాలోచించుచున్నావు.

సీ—క. మొఱసెడు నందియయేనిన్, దొర కెఱిఁగింపదు నను మఱిపోలఁగ స్వానే
పౌరసెనొ మూఁగతనం బది, యొరుల నవఁగ నేల దయ్యమొత్తిడి యుడఁగన్.

[తెరలో] ఓ లంకావాసులారా! సావధానుల రగుచుఁ జక్కఁగా నుండుండు.

క. ఎవఁడో వీఁ డోకకీశప్రవరుండు మహాబలుండు ప్రాకారంబున్
నవలీల దాఁటి లంకం, బ్రవేశముం జేసె మోఁతఁ బడనిపిడుగనన్.

[ఇరువురు వెఱపు నటించుచున్నారు.]

[తెరలో మఱియును.] ఓరోరి లంకావాసులారా! చాలుం ద్రాసముచేతను. రాక్షస
రాజకుమారుఁ డక్షుఁడు వీఁ డతికుపితుఁ డగుచుఁ దానే తదభిముఖముగ ముఖరథను
ర్ధరుం డగుచు నరుగుచున్నాఁడు.

సీ.—[సత్రాసంబుగ] చెలీ! మఱియు నేల యీయశోకవనము వణఁకుచున్నది?

త్రి—[సవితర్కంబుగ,]

ఉ. వెన్నెల యెచ్చనెచ్చవెడవిల్తునియేపున కోపఁజాల కా
పన్నుఁడుత్యక్తలజ్జుఁ డయివచ్చెను రావణుఁ డమ్మచెల్లరిన్
సన్నుతసూర్యవంశసతి సాధ్విని రామనిషణ్ణమానసన్
దిన్నఁగ బుజ్జగించి మది నెక్కొలుప న్విపినాభిముఖ్యుఁడై

[అంతట రావణుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

సీ—[వెఱపుతోఁ బెడమో మిడుకొని కూర్చున్నది.]

రావ—ఓసీ! సీతా!

శా. ప్రద్యుమ్నజ్వరవేదనాపరిపతద్బాష్పస్రుతిక్షాళ్యమా
ణద్యుస్త్రీకుచకుంభకుంకుమరజోన్యస్తాపరాధోజ్జ్వలం
బుద్యద్దిగ్గజదంతిదంతశిఖరప్రోల్లేఖవిఖ్యాపిత
ప్రద్యోతోరుజగజ్జయం బిదియె నావక్షంబు ని ర్గోరడున్.

సీ.—[వినమిచేత]మఱియును రామచంద్రుని మోముచందురునిచే నాకల్దోయినిఁ జల్లఁ
జేయఁగలనఁటే?

త్రి—[జానకింగుఱించి జనాంతికంబుగ] ఓసీతా! ఈప్రకారముగాఁ బ్రలాపించుచున్న
వాని లంకానాథునిని వాకుచే నందాఁక నాదరింపవే.

రా—ఓత్రిజటా! ప్రలాపించుచున్నవాని నని వచించితివి. బాగు.

రావ—చ. నఱుకఁగానంగ మున్ను వఱలినాతల లుద్భవమొంది మ్రొక్కఁ న
క్కఱతిమెడవానికేని నతిక్రైదశమం జెవి వంగ దద్ది నా
కొఱతల యిద్ది మ్రొక్కుచును నీకమలాంఘ్రుల కోసి జానకీ
కొఱలఁ గనిన్నుఁగోరుఁ గడుం గూర్మిని గొప్పతనంబుఁగాంచవే.

సీ—[సంస్కృతము చాశ్రయించి,]

శ్లో. నిజేపాణౌకృత్వావకుళలతికాబాలముకుళం
యయోశ్చక్రే గుంజన్మధుపమవతంసం రఘుపతిః
అపీమాకర్ణామేవవనమిదమాకర్ణ్యనకథం
విశీర్ణాయుక్తం వాం చరితమిదమంతఃకుటిలయోః.

చ. ముని దన చేత గుంజదళిపుంజలసద్వకుళోరుకుట్మలం
బుని చెవతంసమై తగఁ బ్రభూద్వహజైత్రుఁడు వేనియం దవే
వినియుంచు నాదుపీను లిట వీనిదురుక్తిని వీల వేల యో
ష్ఠునుగుటిలాంతరంగముల పుట్టుచరిత్రమి దౌను యుక్తమే.

రావ—ఓవైదేహీ! విలోకనమాత్రమునసైన నంతవఱకు నన్ను సంభావింపవే.

సీ—తే. అపుడు నినుఁ గాంచులంకేశు నవనితనయ

రావ—[సహర్షంబుగ] వే ఱెడోకాల మేటికి వేఁడెదీవు
దానిఁ దెలుపుము నీఁ డెదియేనిఁ జేయుం

వసంతతిలకవృత్తము.

మందోదరిన్నతిని మానుసురాజ్య మన్నన్, బొందించు నీదుపదముం బరమాదరానన్
జంద్రాననా బహుంవచస్సు లిఁకేల నీకై, చెందుం దశాననుఁడు స్వీయశిరస్కహానిన్.

సీత—వెలుఁగునేని ఖద్యోతరుచిని జలజిని.

రావ—[సక్రోధంబుగ] హా! దోసకారీ! ప్రొద్దు మెఱుఁగుడుఁబురువులకు నెంత యంత రువో, యంత యంతరమా రామ రావణులకు? [కత్తి దూసికొని] కావున నీ విపుడు చంపఁబడుదువు.

రా—[సకరుణంబుగ]

శా. హా సీతా యిపు డేక్రియ న్మనెదవే యయ్యో యయో యయ్యయో!
[సగర్హంబుగ]
ఛీ సీ దయ్యము నీదుచేత పొరిదుశ్చింత్యంబు క్రూరంబు
[సక్రోధంబుగ]
రా, కాసీపాపుఁడ యోకులాధముఁడ నిక్కంబోకు నేఁ డ్రుంతు నిన్

[ససంభ్రమముగా]

హా సౌమిత్రి యొసంగు విల్వీలు మదీయం బీయదే దిష్టమా.

ల—ఇది యింద్రజాలభ్రాంతి చేత.

రా—ఈచంద్రహాసాసి సామాన్యముగాదు. మహోగ్రకరవాలము. గాన [illegible]
కావున నీవడిచే వడినే నీవు రావణభుజాశ్లేష ఖేలనమును గ్రహింపుము.

సీ—శా. ఓరిరాక్షస మానుమాను మదిని కీడొసంగడుం బ్రేలె చే
మారా నాదగుకంఠసీమ నెవఁడే నంటం డోరిం చెప్పెదన్
శ్రీరామోరుభుజాసితోత్పల సుమశ్రీధామదామంబునన్
క్రూరాత్ముండగు నీకృపాణమున నేఁ గోల్పోఁ[illegible]దు మాటేటికిన్.

[చంద్రహాసముంగూర్చి]

తే. చంద్రహాసమ శ్రీరామచంద్ర విరహ, హాని[illegible]వా స్మృతము స్మరించు మీవు
కాంతిజితకుక్షిభవమూర్ణ కమవుదాల్తు, ధారచేతను శీతలవారి నార.

రావ—ఇఁకఁ గాలక్షేప మేల? అందువల్ల దీని కుత్తుక నెత్తుటిచేతఁ గాళిక[illegible] ద[illegible] [illegible]
తును.

రా—అహాహా!

శా. కటిచుం గట్టడిసైంహి కేయుఁడు శశిం గ్రొర్వ్యంబునం గోటలన్
సెబిమంటన్ దవవహ్ని గాల్చెదును జన్నెగంధపుం జెట్టునున్
మొటకొపీటెఁడిత్రెంచు నుత్పలసరంబు న్సౌరభోపేతమున్
భెటుశంబద్మిని మత్తహస్తి వరహానిం జేయు దుష్టుం డహా.

రావ—[వాలంకించుచు,] ఎవఁడు? ఎవఁడురా యిక్కడ? నాచేతియందుఁ గపాల
పాత్ర మిడవలయును. దేన దీని కుత్తుక నెత్తురు గోరుచున్నానో? [అని, అశోక
విటపివిటపంబునం గేలుసాచుచున్నాఁడు.]

రా—చ. కువలయదామశోభ నిదిగో వచరించుఁగృపాణ మియ్యెలా
భవగళమందు నిందునను బ్రబ్బెడుఁబేఁకటి నల్లఁజూడఁగాఁ
దవదను శైవడిన్ జలధిఁ దాసె మునింగి యుగంబునర్వమున్
నవ చెడి దిర్ఘిరం దిరుగు సంస్మృతిదప్పెడు సిద్ధు నాకహా.

రావ—[విలోకించి, చమత్కారంబుగ] ఆహా! ఎట్టిది యొవనిదో శస్త్రచ్ఛిన్నమయిన
తలయే నాయటచేత నిడఁబడినది. [సవితర్కంబుగ] మఱి యిది యొవని దవ్వును!

[నిరూపించి] అయ్యో ! చచ్చితి. ఇది యక్షకుమారునియొక్క శిరస్సుగదా ! హృదయమున నునిచికొని,] హా ! వత్సా ! [అని మూర్ఛిల్లి పడుచున్నాఁడు.]

త్రి——దేవా ! ఊఱడిల్లుము ఊఱడిల్లుము.

రా——[ఊఱడిలి,] ఎవని కిటు లిది వెండియుఁ గావలసినది ? [మిగుల వగచి] సరే ! ఆదుండగపు మల్లునకు. అందువల్ల ముందుగం దానినే మ్రందింతును. [అని నిష్క్రమించుచున్నాఁడు.]

రా——[సహర్షంబుగ,] ఆహా ! విషమే యమృతత్వము నందినది.

ల——ఆహా ! సంవిధానవిశేషముయొక్క చమత్కారము !

త్రి——[సీతను గౌఁగిలించుకొని,] చెలీ ! పుణ్యముచే జీవించుచున్నావు.

సీ——పుణ్యము గానిదానిచే నని చెప్పందగినది.

త్రి——ఏల కని ?

సీ——ఎట్లు మఱినాకు నపుణ్యముగాదు ? ఎందువలన, రామచంద్రు నెడబాటువలనఁ బొడమిన వేఁకినిఁ బోకడ పెట్టుటకై కోరునట్టి నేను జంద్రహాసము వాదరచేతఁ దొలఁగింపఁబడనయితినో ?

త్రి——చెలీ ! ఇట్లు చెప్ప నొప్పదు. "జీవన్ భద్రాణి పశ్యతి" "బ్రదికియుండిన సుఖములఁ బడయవచ్చు" అని, వాక్రుచ్చెదరుగద ?

సీ——దీనిచే నేమి ? ఈ నామేనిని జల్లఁగఁ జేసికొనుటకై నిప్పుం దెమ్ము.

త్రి——పాప ముపశమిల్లుత. ఏమిది యపుణ్యము నుదాహరించుచున్నావు ?

క. హిమకరరుచియుత మరకత, సుమణిమయ మనోజ్ఞపట్టసుందరమందున్
సమలయజరసమునందున్, రమణునిరొమ్మునం దణఁతు విరహతాపంబున్.

సీ——ఆసాద లిడు నీనుడికారముచే నేమి? నీ వొక నిప్పురవ్వఁదెమ్ము. దానిచే నీచెట్టుక్రింద రాలియున్న చిదుగులమంటఁబెట్టి నాకోర్కినిఁ గొనసాగించుకొందును.

త్రి——[పోయి తిరిగివచ్చి] నెచ్చెలీ ! ఇచ్చోటు చిచ్చుదొరకనిది.

రా——బాగు. త్రిజట చతురురాలు.

సీ——[అశోకమును విలోకించి, సంస్కృతముతో.]

శ్లో. కురుసకరుణంచేత, శ్రీమన్నశోకవనస్పతే
నవపవకణికామేకాం వామేపురకప్రకటీకురు,

